ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow
@mohanpublications




- కలవపూడి వేంకటాచార్యులు

# ధర్మరాజు

# DHARMARAJU.

# ధర్మరాజు.




గ్రంథకర్త.

విద్వాన్. కలవపూడి వేంకటాచార్యులు.

తెలుఁగు పండితుఁడు.

**Govt. Secondary and Training School for Women,**

**Rajahmundry.**



***K. L. N. Somayajulu.***

Godavari Book Depot,

Rajahmundry.

స్కేప్ అండ్ కో., ముద్రాశాలలో

కె. సుబ్బారాయసోదరులచే ముద్రింపఁబడియె.

కా కి నా డ.

1927.

"ధర్మరాజు"

ఈపుస్తకమును రచించియిమ్మని గోదావరి బుక్కు డిపో. కే. యల్. యస్. సోమయాజులుగారు కోరినందున అట్లువ్రాసి యేమియు ప్రతిఫలముకోరకుండ సంపూర్ణ సర్వ స్వత్వములతో వారికిచ్చివేయుట యైనది

కలవపూడి వేంకటాచార్యులు.

17—21—1926.

# విషయసూచిక.




| | | | |
|---|---|---|---|
| 1. | అనుక్రమణిక. | పేజి | 1 |
| 2. | జననము. బాల్యము. | ,, | 5 |
| 3. | యౌవరాజ్యప్రాప్తి. కొన్ని చిక్కులు. | ,, | 16 |
| 4. | ఉద్వాహము. | ,, | 27 |
| 5. | రాజ్యప్రాప్తి. మయసభ. | ,, | 37 |
| 6. | రాజ్యాంగపద్ధతులు. | ,, | 45 |
| 7. | రాజసూయము. | ,, | 49 |
| 8. | రాజ్యభ్రంశము. | ,, | 58 |
| 9. | వనవాసము. | ,, | 68 |
| 10. | శరణాగతరక్షణము. | ,, | 74 |
| 11. | విజ్ఞానసంపద. (యక్షాజగరప్రశ్నలు.) | ,, | 78 |
| 12. | అజ్ఞాతవాసము. | ,, | 88 |
| 13. | సంధియత్నములు. | ,, | 103 |
| 14. | యుద్ధము. | ,, | 121 |
| 15. | పట్టాభిషేకము. | ,, | 139 |
| 16. | పెద్దలస్వర్గప్రాప్తి. | ,, | 140 |
| 17 | మహాప్రస్థానము. | ,, | 143 |
| 18. | స్వర్గారోహణము. | ,, | 147 |






# ధర్మరాజు

## మొదటిప్రకరణము

### అనుక్రమణిక.

శ్రీమంతంబై సమస్తమహీమండల మండనమైయొప్పారు భరతఖండమున సూర్యవంశము చంద్రవంశమునను సుప్రసిద్ధములగు క్షత్రియవంశములు రెండుండెడివి. అందు సూర్యవంశ్యులగు రాజన్యులు నిరుపమానప్రతాపదీపితులై జగత్ప్రసిద్ధమై ముక్తిదాయకనగరములలో నగ్రగణ్యమయిన యయోధ్యాపట్టణము రాజధానిగ వసుంధరావలయమును బాలించి ప్రఖ్యాతివహించిరి. నిర్మల శీతలకర ప్రసారమునఁ బ్రపంచము నానందాంబుధి నోలలాడఁజేయు నమృతకిరణుఁడు చంద్రవంశమునకుఁ గర్త. ఈవంశజులలో మొదటివారధిష్ఠానపురమును దరువాతివారు హస్తినాపురమును రాజధానులుగఁ జేసికొని తమ రాజనామంబు సార్థకంబుగ విశదయశశ్చంద్రికల దిగంతములఁ బర్వఁజేయుచుఁ గువలయానందసంధాయకులై ప్రజలను గన్నప్రజలవలె నెంచి మించిన ప్రేమతోఁ గాచుచుండిరి.

చక్రవర్తులలో నాలుగవవాఁడుగాఁ బరిగణింపఁబడిన పురూరవసుఁడు చంద్రునిమనుమఁడు. అతనివంశమున జన్మించిన నహుషుఁడింద్రుఁడయ్యెను. యయాతి నిజతపోమహిమాతిశయంబున బ్రహ్మలోకమునొందెను. భరతుఁడు నిస్తుల ప్రతాపవిరాజితుండై భూమండలమంతయు జయించి దానిని నిజనామంబున భరతఖండంబునాఁ బరగఁజేసెను. ఇంకను గొందఱు మహనీయులీవంశమున జన్మించి ప్రఖ్యాతులైరి.

ఏతాదృశమహావిభవసంపన్నమగు భరతవంశమున శంతనుఁడు జన్మించి మహిమచేఁ బూర్వులనుమించి కారణాంతరమున మానవవనితారూపధారిణియగు గంగాదేవిని బరిణయమై యామెయందు మహాబలపరాక్రమవిరాజితుండును సకలధర్మవిదుండును నగు భీష్మునిఁగాంచెను.

భీష్ముఁడు వేదశాస్త్రములను జక్కఁగా నభ్యసించి పరశురామునికడ ధనుర్వేదమును నేర్చి యౌవనప్రాయముననే యప్రతిహతవీరుఁడని పేరుగాంచెను. పితృవిషయమున నాతఁడాత్మసుఖమును దృణీకరించి శాశ్వతబ్రహ్మచర్యమూని యతఁడుకోరిన సత్యవతియను కన్యారత్నము నాతనికి వివాహము చేయించి సంతుష్టుఁడగు నాతనివలన స్వచ్ఛందమరణమును వరముగాఁబడసెను. శంతనునకామెయందుఁ జిత్రాంగదుఁడు విచిత్రవీర్యుఁడునను నిరువురు కుమారులు జన్మించిరి. వారిలోఁ బెద్దవాఁడగుచిత్రాంగదుఁడు తనకుసనాముఁడగు నొక గంధర్వునితో ఘోరసమరంబొనరించి మడిసెను. కావున విచిత్రవీర్యుఁడే రాజ్యాధిపత్యమును వహింపవలసివచ్చెను.



భరతవంశమునకు విచిత్రవీర్యుఁడొక్కఁడే మిగిలియుండుటవలన నెట్లయిన నాతని నభివృద్ధిలోనికిఁదెచ్చి కులము విస్తరింపఁజేయఁగోరి శాంతనవుండాతని కతిలోకవైభవము నడుపుచుఁ గడుప్రేమతోఁజూచుచుఁ గాశీరాజపుత్రికలగు నంబికాంబాలికలను బలమునజయించి తెచ్చి యాతనికి వివాహమొనరించెను. విచిత్రవీర్యుఁడాసుందరుల సౌందర్యమునకు వశుఁడై యత్యాసక్తితో సంచరించి క్షయక్షీణాయువై యల్పకాలముననె సంతతిహీనుఁడై మరణించెను. పాపము! భీష్మునకు నడుము విఱిగినట్లయ్యెను. చిరప్రఖ్యాతమగు భరతవంశ మంతరించు సమయము తటస్థించెను.

సత్యవతి యీపరిస్థితులనుగని దుఃఖితయై కొంతవడి యాలోచించి భీష్మునిఁబిలిచి ప్రస్తుతమునఁ దమకులంబునకుగలిగిన విపత్తునాతనికిఁదెల్పితనయుపయోగమునిమిత్తమై పూనిన బ్రహ్మచర్యవ్రతమును విసర్జించి విచిత్రవీర్యునికళత్రములయందుఁ బుత్రసంతానమును బ్రసాదింపఁగోరెను. కానియాతఁడు సమ్మతింపక యుత్తమక్షత్రియకళత్రములయందుఁ బవిత్రులగు బ్రాహ్మణోత్తములవలన ననేకులు రాజులుత్పన్నులై వంశకర్తలగుటనుదెల్పి సంతానదానమునకు వేదవ్యాసుఁడు తగినవాఁడని విన్నవించెను. ఆమెయందులకు సంతసించి వేద

వేదాంగనిపుణుఁడును ధర్మాధర్మవిదుఁడునునగు కృష్ణద్వైపాయనుని రప్పించి యాతని నంబికయందుఁ బుత్రసంతతి నుత్పాదింపఁగోరెను. అతఁడంగీకరించెను. అతనివరమున నంబికయందు ధృతరాష్ట్రుఁడును నంబాలికయందుఁ బాండురాజును నంబికాదాసియందు మాండవ్యమహర్షి శాపమువలన యముఁడు విదురుఁడను పేరను జన్మించిరి.

ధృతరాష్ట్రపాండురాజులును విదురుఁడును భీష్మునిసంరక్షణంబునఁ బెరుఁగుచుఁ గ్రమముగ విద్యలనుగ్రహించుచుండిరి. వారు బాలురై యున్నంతకాలమును రాజ్యము భీష్ముని పాలనమునకు లోఁబడియుండెను, ఆకాలమున దేశమంతయు సస్యసమృద్ధమై యీతిబాధారహితమై సుభిక్షమై జారచోరాదిబాధలు లేక ప్రశాంతమై కృతయుగముందలఁపించుచుండెను.

కాలక్రమమున బాలురు యౌవనసంపన్నులయినపిదప భీష్ముఁడు ధృతరాష్ట్రుని రాజ్యాధిపతిగ నభిషేకించి పాండురాజు నాతనిసేనాధిపతిగా నియోగించి బాలుఁడయ్యును నిరుపమానజ్ఞానవంతుఁడును రాజనీతి విశారదుండును నగుటచే విదురుని మహామాత్యపదమునను౦చి తానుపైనుండి సహస్రవిధములఁగనుపెట్టి రక్షించుచుండెను. యౌవనవంతుఁడైన ధృతరాష్ట్రునకాతఁడు సుబలరాజుకుమార్తెయగు గాంధారిని వివాహముచేయించెను. పాండురాజు కుంతిభోజునికుమార్తెయు వసుదేవునిసహోదరియు నగుకుంతిని మద్రదేశాధీశుని సుతయగు మాద్రిని నుద్వాహమయ్యెను, కురువంశమిట్లు మరల నభివృద్ధి దశకువచ్చెఁగదా యని శాంతనవుండు సంతసించెను,



---

## రెండవ ప్రకరణము.

### జననము. బాల్యము.

పాండురాజు దిగ్విజయంబొనరించి యటసంపాదించిన ధనరాసులు తెచ్చి ధృతరాష్ట్రునకర్పించి యతనిచే ననేకహయమేధము లొనర్పించి యథోచితదక్షిణల ధరణీదివిజుల బహూకరించి మిగిలినధనము భీష్మునకు సత్యవతికిఁ దల్లులకు విదురునకు సుహృద్వరులకుఁ బంచియిచ్చి వారివలన ననేకాశీఃప్రశంసలు వడసెను. అతఁడు ధృతరాష్ట్రునియెడల వినయవిధేయతలుగలవాఁడై యభిమతకార్య సంపాదనమున బంధుపులందను పృచు మిత్రజనానుకూలుఁడై జ్ఞానవిశేషమున విద్వత్ప్రియుండై దీనానాథజనులఁ గారుణ్యంబునఁజూచుచుఁ దనపూర్వులగు పూరుభరతాదులతోఁ దుల్యుఁడను జనప్రశంసకుఁ బాత్రుఁడయ్యెను. నిరంతరము ననేకవినోదంబులను నిచ్ఛానుకూలములగు విషయసుఖానుభవంబులను నాతండు ప్రొద్దుపుచ్చుచుండెను.

అట్టితఱి నాతనికి దైవవశమున మృగయావిహారంబొనర్పవలయునను కుతూహలము జనించెను. తోడనే యాతఁడు సకలపరివారసమేతంబుగ ధర్మపత్నులగు కుంతీమాద్రులతోడరా హిమవన్నగపార్శ్వభూముల కేగి యచటనివాస మేర్పఱచుకొని ధృతరాష్ట్రుఁడు పుత్తెంచు నిష్టాన్నపానమాల్యానులేపనభూషణాదుల ననుభవించుచు నుపవనప్రదేశంబునందువలె వనవాసవ్యాసంగంబుననుండెను.

ఒక్కదినంబున నాతఁడు విపినమధ్యంబున మృగయాశైలనంబున సంచరించుచు నొక్కమృగంబైన దృష్టిగోచరంబు కాకుండుటవలన విసికి యొక్కచోట మృగరూపధరులై సంచరించు మునిదంపతులను గేవలమృగభ్రాంతిని బాణంబులతోఁగొట్టెను. బాణముల దారుణపాతమున కోర్వఁజాలక యల్పావశిష్టజీవమై పడియున్నమృగము తమవృత్తాంతము విశదీకరించి మృగములనుజంపుట రాజులకుఁ గర్తవ్యమైనను జతగూడియుండువానిని సంహరించుట కేవలమధర్మము. అనపరాధుల మమ్మిట్లువధించితివిగాన నీవును బ్రియాసంగమాను క్షణమున పంచత్వము నొందుదువుగాక. నీప్రియయు నిన్ననుగమించుఁగాతమని శపించి విగతప్రాణయయ్యెను.

పాండుమహారాజు దానింగాంచి మిగులవగలంబొగిలి సత్సంతానమై ధర్మమార్గప్రవృత్తుండగు తనకట్టి దుర్వ్యసనము కర్మవశముననె సంభవించెనని నిశ్చయించి సంతానహీనుండగు తనకు మునివృత్తియె యుచితము కావున సర్వసంగపరిత్యాగమొనర్చి సర్వభూతములందును సమచిత్తుండై హింసాకార్యములం దలపెట్టక నిత్యము నొక్కొక్కవనస్పతి యందొక్కొకఫలము భిక్షగాఁగొనుచు నల్లుసంభవింపని నాఁడుపవాసములనొనర్చుచు సుఖదుఃఖములయందు సమభావము గలిగి వలయు నియమములతో నచటనేయుండి తపంబొనర్చుటకు నిశ్చయించి కుంతీమాద్రులంగాంచి సీమంతినీమణులారా! మీరిందుండి యలయక హాస్తినగరంబున కేగుఁడు. మాయన్నకును సత్యవతీదేవి మున్నగువారికిని నేనిట్టిభంగము నొంది విరక్తుండనై యిచటనే తపోవృత్తితోనుంటినని విన్నవించి యచటనే సుఖముగానుండుఁడు. అనియాజ్ఞాపించెను.

వారందులకంగీకరింపక పరిపరివిధముల నాతనిం బ్రార్థించి యొడంబఱచి తమయమూల్యమణిభూషణాదులనన్నిటి నిగూడ వచ్చినవారికిఁ బంచియిచ్చి తపస్వినీవేషధారిణులై తమపతి ననుసరించిరి. పాండురాజు తమవృత్తాంతము ధృతరాష్ట్రాదుల కెఱిఁగింప నియోగించి పరివారమును వీడుకొల్పి ధర్మపత్నులిరువురును వెంటరా హిమవద్గంధమాదనములను దాటి యవ్వల శతశృంగమను పర్వతరాజమును జేరి యచట దపోవృత్తితో నుండెను.

పాండురాజు తపోనిష్ఠ, మనోనిశ్చలత, తపశ్చర్యానిపుణత మున్నగువానినిఁ జూచి యచటిమునులుగూడ విస్మయమొంది

క్రమముగా నాతనితో మైత్రి నెఱపిరి. అతఁడు తదేకధ్యానతత్పరుఁడై తననిశ్చలతపంబున బ్రహ్మర్షి సదృశుండయ్యెను.

ఒకనాఁడచటి మునీశ్వరులందఱును బ్రహ్మలోకంబున జరుగఁబోవుసభ కరుగుచుండిరి. అదిచూచి పాండురాజు భార్యాసహితముగాఁ దానుగూడఁ బోవసమకట్టెను. అపుడు ఋషులు అది సంతతిహీనుల కగమ్యమగుతావనియు నదియెఱింగించిన నాతఁడు చిన్నపుచ్చుకొనుననియుఁ దలంచి మిషగా నివారింపనెంచి యతనితో రాజా! దుర్గమమగు నీమార్గమున నతిసుకుమారలగు వీరలతో నేగుటకష్టము. కనుక రావలదనిరి. దానివలన నతఁడు తనకు సంతతిలేకుండుటచే వారట్లు నిరాకరించుచున్నారని గ్రహించి కొంతవిచారించెను. అది చూచి త్రికాలజ్ఞులగు నాఋషులు రాజా! నీవు విచారింపవలదు. మునుముందు మీకు దైవదత్తమై మిగులఁగీర్తిమంతమగు సంతానము లభింపఁగలదు. అంతవఱకు నోర్చియుండుము. అని వారినివిడిచి తామేగిరి. తనసంతానహీనతకుఁ బాండు రాజు మిగులఁ విచారించుచుండెను.

అంతఁ గొలఁదిదినములకు విదురునికిఁ బుత్రప్రాప్తియయ్యెననియు గాంధారిగర్భవతియై యుండెననియు శుభవార్త పాండురాజునకుఁ దెలియవచ్చెను. అదివిని యాతఁడు వారియదృష్టమునకు సంతసించినను దనకట్టియోగ్యత లేకపోయెఁగదాయని విచారపూరితహృదయుఁడై యుండెను. భర్త పూర్వ



మువలెఁగాక సదాఖిన్నుఁడైయుండుటను గ్రహించి కుంతిరహస్యముగ నాతనికడకేగి విచారణకారణ మడిగెను. అందుల కాతఁడు దేవీ! సంతానహీనులకుఁ బితౄణముతీరదు. ఆకారణమున వారికిముక్తి లేదు. నాకట్టియోగ్యత లేదుగదాయని చింతించుచున్నాను. అనిపలికెను. దానికామెయువగచిచిన్ననాఁడు దనకు దూర్వాసుఁడొసంగిన మంత్రవృత్తాంతము నాతనికివిన్నవించి దేవతలనారాధించి వారివరములుపొంది సంతతి నిగాంచెదను. తమకిష్టులగు దేవతలను బేర్కొనుఁడు.అని సవినయముగా విన్నవించెను.

ఆపలుకులు తనవీనుల కమృతంపుసోనలై విందుసేయఁ బాండురాజు నాతీ! నేనుమిగుల ధన్యుఁడను. నీవలన మావంశ ముద్ధరింపఁబడినది. నీకిట్టివరమునొసంగిన యామహర్షి మిగులఁ బ్రశంసనీయుఁడు. సర్వసృష్టికిని ధర్మముమూలము. అది లేకున్నఁ బ్రజాపాలన మశక్యము. కావున నన్నివిధములను ధర్మవంతుఁడగుపుత్రునిబడయుటకు ధర్మదేవతయగు యముని నారాధింపుము. అతనివరమువలన జన్మించు సుతుఁడు సర్వథాధర్మాత్ముఁడు కాఁగలఁడు," అని యానతిచ్చెను.

అపుడు కుంతి భర్తకుఁ బ్రదక్షిణనమస్కారములొనరించి యాయనయాజ్ఞప్రకారము మునిదత్తమంత్రమును జపించి యముని బ్రార్థింప నాతనివరమువలన

ఉ॥ శాత్రవజైత్రతేజమునఁ సర్వదిశల్ వెలుఁగొందనెంద్రిన
క్షత్రియుతుండుగాశశిప్రకాశజయోన్నతమైన యష్టమిన్

మిత్రముఖగ్రహప్రతతి మేలుగ నాభిజితోదయంబునం
బుత్రుఁడు ధర్మునంశమునఁ బుట్టె నతిస్థిరధర్మమూర్తియై॥

సకలసార్వభౌమలక్షణలక్షితుఁడును, సుసుందరాకారసంపన్నుఁడును, మహాతేజోవంతుఁడును, మహాబాహువుఁడునగు నాకుమారునిజన్మసమయమున భూతజాతమంతయు మిగుల సానుకూల్యముచూపెను. దేవదుందుభులు మ్రోసెను. పుష్పవృష్టి కురిసెను. "ఈబాలుఁడు ధర్మవేత్తలలో నుత్తముఁడును మహాశూరుఁడును సత్యవాదియుఁ గాఁగలఁడు. యుధిష్ఠిరుఁడని ప్రఖ్యాతిఁ గాంచఁగలఁడు. ఈమహాత్మునివలన భూలోకముద్ధరింపఁబడును." అని యశరీరవాక్కు మహాగంభీరమధురధ్వనితో వచించెను. అచటిమహర్షిసంఘము లాకుమారునకు జాతకర్మాదులొనర్చి మిగుల నానందించెను. పాండురాజు పరమానందమగ్నుఁడయ్యెను. కుంతీమాద్రులు సంతసించిరి. అటులనే కాలక్రమమునఁ బవనేంద్రులయనుగ్రహమున భీమార్జునులును, గుంతీదత్తవరప్రసాదమున మాద్రియందశ్వినీదేవతల ప్రసాదమువలన నకులసహదేవులును జన్మించిరి.

### బాల్యము.

యుధిష్ఠిరాదులందఱును దల్లిదండ్రులకడ నల్లారుముద్దుగాఁ బెఱుగుచుండిరి. వారొక్కొక్క సంవత్సరము ప్రాయముకలిగియున్నప్పుడుకూడఁ బుష్టిగలిగి యైదేండ్లవయసుగలవారివలెఁ గన్పట్టుచుండిరి. సత్త్వవంతులగు తనకుమారులను జూచు



కొని పాండురాజు మిగుల నుప్పొంగిపోవుచుండెను. శతశృంగనివాసులగు ఋషులును దత్పత్నులును నీకుమారులను దమబిడ్డలవలె మిగుల గారాబముగాఁ జూచుచుండిరి. వీరిచర్యలు మహర్షులకు సయితము విస్మయావహములుగానుండెను.

ఇచట నిటులఁ బాండురాజునకుఁ బుత్రప్రాప్తియైనదను శుభవార్త క్రమముగా వసుదేవాదులకుఁ దెలియఁగా వారందఱును మిగుల నానందించిరి. వసుదేవుఁడు కుంతికి సహోదరుఁడు. అతఁడు తనపురోహితునిచే మేనల్లుండ్రకనేకములగు రాజకుమారోచిత మణిభూషాంబరాదులను గుంతిమాద్రులకు దాసదాసీజనములు గోవులు ధనము మొదలగువానిని విశేషముగాఁ బంపెను. ఇట్టి వస్తుసామగ్రినిగొనివచ్చిన కాశ్యపుఁడను నాపురోహితునిఁ బాండురాజు మిగులగౌరవించెను. వసుదేవుఁడు తమపైఁ జూపిన ప్రేమకుఁ గుంతీమాద్రులు సంతసించిరి.

పాండురాజు కాశ్యపునిచేఁ దనకుమారుల సమస్తబాల్యకృత్యములను దీర్పించి సకాలమున నుపనయనము చేయించెను. నాఁటినుండియు యుధిష్ఠిరుండును మిగిలిన బాలురును నచటఁ దపముసేయుచున్న శర్యాతికుమారుఁడగు శుక్రుఁడను మహర్షివద్ద వేదత్రయమును సాంగముగా నేర్చి ధనుర్వేదము నభ్యసించిరి. యుధిష్ఠిరుఁడు తోమరములను బ్రయోగించుటను మిగుల శ్రద్ధతో నేర్చుకొనెను. భీముఁడు గదాయుద్ధమును, నార్జునుఁడస్త్రవిద్యను గొంతవఱకు నేర్చుకొ

రిరి. అసిచర్మముల నుపయోగించుటయందుఁ గవలు కృతకృత్యులయిరి.

ఇంతలో వసంతర్తువు పొడసూపెను. ఏయెడలఁ జూచినను దరులతాదులు నూత్నపల్లవపుష్పసంశోభితములై కన్నులపండువు సేయుచుండెను. పువ్వుపువ్వునకెగురుచు మకరందముఁ ద్రావుచు మధుకరములు తమమధురఝంకారముల వీనులవిందుగావించుచుండెను, సీతాశోకచిలుకలు చిత్రవర్ణములుగల పత్రములతో నెల్లెడల నొప్పారుచుండెను, చూతపల్లవగ్రాసకషాయకంఠములగు కలకంఠములు ద్రుమశాఖాంతరములనుండి హాయిగాఁ బంచమస్వరములను బ్రతిపాదించుచుండెను. వేయేల ? ప్రకృతియంతయు శృంగారరసావిర్భావ హేతువై యలరారుచుండెను.

సకలభూతజాతసమ్మోహనమైన యట్టి వసంతసమయమున నర్జునుని జన్మదినము వచ్చెను. నాఁడు కుంతి మహాశ్రద్ధతో బ్రాహ్మణులచే స్వస్తివాచనములు జరిపించి వారిసంతర్పణయందు వ్యగ్రయైయుండెను. ఆసమయమునఁ బాండురాజు మాద్రిసౌందర్యమునకు ముగ్ధుఁడై శాపప్రకారము యుధిష్ఠిరప్రభృతిరాజకుమారులు సంప్రాప్తయౌవనులు కాకపూర్వమె బంధుశూన్యమగు నాయరణ్యమునందుఁ గాలధర్మము నొందెను.

నిస్సంజ్ఞుఁడై పడియున్న భర్తపైఁబడి మాద్రి పెద్దపెట్టు



న రోదనముచేసెను. ఆయార్తధ్వనివిని దిగులొంది పుత్రసహితముగాఁ గుంతియు నకులసహదేవులును నచటికిఁ బఱువెత్తుకొనివచ్చిరి. కుంతిమృతుఁడైనపతిఁగాంచి పరిపరివిధముల విలపించి శోకవేగమున నిశ్చేష్టయై పడియుండెను. యుధిష్ఠిరాదులు నిర్విణ్ణులై తండ్రిపాదములపైఁబడి బహుధావిచారించుచుండిరి. కుంతీమాద్రులు మూర్ఛనుండి తేలి భర్తతో సహగమనముచేయఁ బ్రయత్నించితిరి.

ఆసమయమున వనౌకసులగు ఋషులచటి కరుదెంచి వీరియాపత్తునకు వగచి ధైర్యముగఱపి “మీకుమారులు బాలురు, ఇట్టివీరిని వీడి సహగమనముచేయుట ధర్మము కాదు. భర్తమృతినొందినను పతివ్రతలగు సతులు బ్రహ్మచర్యము నవలంబించి యమనియమాదులచేఁ బవిత్రులయి భర్తనేస్మరించుచుండిన ముక్తిఁగాంతురు. కాఁబట్టి యట్టిధర్మము నవలంబించి పుత్రులసంరక్షించుకొనుచు మీరుజీవించియుండుటయే శ్రేయ”మని పలికిరి.

ఋషివర్యుల పలుకులకుఁ గుంతిసమ్మతించెను. మాద్రికిమాత్రము మనసొప్పక పతిమృతికిఁ దాన హేతుభూతయగుటవలనఁ దనపుత్రులనుగూడఁ గుంతికప్పగించి తానుసహగమనముచేయుటకే నిశ్చయించెను. ఆమె తనకుమారులను బునఃపునరాలింగనములొనర్చి కుంతికొప్పగించి పెద్దకుమారుఁడగు యుధిష్ఠిరునిచేయిపట్టుకొని “పుత్రులారా ! మీకునిజముగా

జననికుంతి. నేనుదాదిని. మీతండ్రిచనిపోయెను. మీనలుగురకును పెద్దయగుటవలనఁ 'పితృసమోజ్యేష్ఠ'యను న్యాయమున నీయుధిష్ఠిరుఁడె తండ్రివంటివాఁడు. కాఁబట్టి మీరందఱును ధర్మాత్ముఁడగు నీతని కాజ్ఞానువర్తులై శుభంబులొందుచుండుఁడు" అని బుద్ధులుసెప్పి ఋషిపత్న్యలకును గుంతికిని బ్రణమిల్లి వారివలన ననుజ్ఞాతయై భర్తతో సహగమన మొనర్చెను.

మహర్షులు కుంతిని గుమారులను నూరడించి పాండవులకు దామె విద్యాబుద్ధులుగఱపిరి. యుధిష్ఠిరునకుఁ బదునాఱు వత్సరముల ప్రాయమువచ్చెను. ఇఁకవీరిని ధృతరాష్ట్రునికడకుఁ గొనిపోయి యొప్పగించుటమంచిదని వారుపుత్రసహితముగాఁ గుంతిని వెంటఁబెట్టుకొని హస్తినాపురమునకువచ్చిరి. పౌరులు పాండవులరాకవిని గుంపులుగాఁగూడి వచ్చిచూచి ఆహా! ఏమి వీరియాకారవిలసనము!!

ఉ॥ "వీరలు దైవశక్తిఁ బ్రభ ♦ వించినవారగుటేమి సందియం
బీరమణీయకాంతి నుప♦మింపఁగ వేల్పులకారె యిట్టి యా
కారవిశేషసంపదఁబ్ర ♦ కాశితతేజము పేర్మిఁజూడ సా
ధారణమర్త్యులే................................"

వీరుదైవతేజమున జన్మించిరనుటకు సందేహమేమి. వీరి తేజోవిశేషములుచూడ సామాన్యమనుజులు వీరియెడను నిలువనైన సమర్థులుగారని తోఁచుచున్నది. ఇట్టివారిని దర్శించి మనము ధన్యులమైతిమి, అని పలువిధములఁ బ్రశంసించిరి.



మునులు వీరినివెంటఁగొని క్రమముగా రాజమార్గంబునఁ గొంతదవ్వరిగి రాజమందిరముసమీపించిరి. అచట వీరి రాకనెఱింగి ధృతరాష్ట్రునిచేఁ బంపఁబడిన పురోహితామాత్యాదులును ధార్తరాష్ట్రశతమును వీరినెదుర్కొని సభామంటపమునకుఁ గొనిపోయిరి. పాండవు లచటివృద్ధులకందఱకు నమస్కరింప వారందఱును మహానురాగంబున నాశీర్వదించిరి. కుంతియు విదురధృతరాష్ట్రగాంధార్యాదులును నొండొరులను జూచుకొని పాండురాజుమరణంబునకు మిగులవగచిరి. మునులందఱును బ్రశాంతవచనంబుల నోదార్చిరి.

అందొక వృద్ధమహర్షి మునులయనుమతమున లేచి పాండురాజు శతశృంగపర్వతమునకుఁ జనినదాదిగా నాఁటివఱకును జరిగిన యావద్వృత్తాంతము నెఱిఁగించి "యీకుమారులు కురువంశవర్ధనులు, దేవస్వరూపులు. యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులనఁబడువారు. దేవతల వరప్రసాదమునఁ బ్రతిపాదింపఁబడినవారు. బ్రహ్మర్షులు వీరికుపనయనాదులు గావించిరి. కనుక ధర్మబుద్ధితో వీరిని నీకుమారులతోఁబాటు రక్షించుచుండునది."యని కురువృద్ధులగు భీష్మధృతరాష్ట్రులకు వారల నొప్పగించెను. పిదప మహర్షులంతర్హితులైరి.

ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరాదులను దనకుమారులకంటె నెక్కుడుప్రేమతోఁ బెంచుచుండెను. యుధిష్ఠిరుఁడు తన బుద్ధినైపుణ్యమువలనను వినయాది సద్గుణగరిమవలనను,

గురువృద్ధులయు గురువర్యులయు ప్రీతికిఁ బాత్రుఁడయ్యెను. అందఱును యుధిష్ఠిరునివంటి ధర్మాత్ముఁడుండఁబోఁడను దృఢమగునభిప్రాయమును గలిగియుండిరి. మిగిలిన పాండవులును నమ్రులై మిగులననురాగముఁగలిగి ధార్తరాష్ట్రులతోఁ గలసి మెలసి సంచరించుచుండిరి.

పాండవులు హస్తినాపురమునకుఁ జేరినకొలఁదికాలమునకే పరశురామశిష్యుఁడగు ద్రోణాచార్యుఁడు హస్తినగరమునకు వచ్చుట తటస్థించెను. భీష్ముఁడాతనికి వలయువస్త్రవాహనాదుల నొసఁగి యటనుండి కుమారవర్గమునకు ధనుర్విద్య నేర్పుమని ప్రతిమాలుకొనెను. అందులకతఁడంగీకరించి యొకచోఁ బాఠశాల నేర్పఱచి పాండవధార్తరాష్ట్రులకును మఱి కొందఱు రాజకుమారులకును విద్యగఱపుచుండెను. అందఱిలోను యుధిష్ఠిరుఁడే యెక్కుడు వినయభయభక్తి విశ్వాసములతో సంచరించుచుఁ గొలఁదికాలములోనే గురువర్యుల సంపూర్ణానుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను.

## మూఁడవ ప్రకరణము.

### యౌవరాజ్యప్రాప్తి, కొన్ని చిక్కులు.

యుధిష్ఠిరుఁడు విద్యావినయవివేకసంపన్నుఁడగుటవలనను భీమసేనుఁడు నిరుపమానభుజబలవిరాజితుఁడగుటచేతను నర్జునుని ధనుర్విద్యాపారంగతత్వమువలనను నకులసహదే



వులు కృపాణాది సాధనములనుపమానముగాఁ బ్రయోగించు నేర్పు గలవారగుటచేతను విశేషించి యందఱును నిగర్వులు నిరహంకారులు నిత్యసత్యవ్రతులు నగుటవలనను బ్రకృతిజనములు కాలక్రమమునఁ బాండవులయెడ నెక్కువ పక్షపాతముఁ గలిగి యుధిష్ఠిరుఁడు తమకుఁ బరిపాలకుఁడైన బాగుగా నుండును గదా యని తమలోఁ దాము ననుకొనుచుండిరి. ఆతఁడట్లు ప్రజానురాగము సంపాదించిన కారణమునను బ్రభువునకు ముఖ్యముగా నుండఁదగిన యోగ్యతలన్నియుఁ గలిగియుండుటవలనను సమయముచూచి యాతని నీరాజ్యాధికారపదవి యందుంచవలెనని భీష్మద్రోణవిదురాదులందఱును తమలో నిశ్చయించుకొనిరి.

అదియెఱిఁగి ధృతరాష్ట్రుఁడొకనాఁడు బుద్ధిమంతులగు విదురాదిమంత్రులను బిలిచి యావిషయమున నాలోచనము గోరెను. వారపుడు "రాజా! ధర్మనందనుఁడు మిగుల ధర్మాత్ముఁడు. అట్టివానిని యౌవరాజ్యమునకభిషిక్తు నొనర్చినఁ బ్రజలందఱును బహువిధముల సంతసింతురు. నీకొఱకు బహువిధముల శ్రమనొంది రాజ్యము నిస్సపత్నము చేసిన పాండురాజునెడలఁ గృతజ్ఞతచూపినట్లును నగును. కనుక నీపనిని త్వరలోఁ బూర్తిచేయింపుము." అని యాతని బ్రోత్సహించిరి. అంబికేయుఁడు మౌహూర్తికనిర్ణీతమయిన శుభముహూర్తమున యుధిష్ఠిరుని యౌవరాజ్యపట్టభద్రునిఁ గావించెను.

ఇట్లతఁడు సంప్రాప్తయౌవరాజ్యపదవీభాసమానుఁడై లోకానందకరుఁడై యుండెను. ప్రజలెల్లరు నితని ధర్మబుద్ధికిని సత్యరతికిని బెద్దలయందుఁ గలభక్తితాత్పర్యములకును గడుసంతుష్టి నొందుచు నానాఁటి కాతనియం దత్యంతానురక్తులగుచుండిరి. దీనికిఁ దోడితని తమ్ముల సాహసపరాక్రమములుఁగూడ వారి యనురాగమును వృద్ధిసేయుచుండెను. ఏసందర్భమునందైనను నవకాశము గలిగినపుడెల్ల జనులు వారి నిబలుతెఱఁగులఁ బ్రశంసించుచుండిరి. ధార్తరాష్ట్రులకు మాత్రము నామరూపములు పూజాపురస్కారములు లేకయుండెను. అందువలన దుర్యోధనుఁడు విచారాక్రాంతుఁడై లోలోపల మిగులఁ గుందుచుండెను.

ఒకనాఁడు దుర్యోధనుఁడు కర్ణశకునిదుశ్శాసనాదులతో రహస్యముగ నాలోచించి కణికుఁడను నాతఁడు తనకొనర్చిన దుర్బోధ కంగీకరించి తండ్రికడకుఁ జని యిట్లని విన్నవించెను. నాయనా! పాండుసుతులు కడుపరాక్రమవంతులు వారిఁ జూచినపుడెల్ల నాయుల్లముజల్లుమనుచుండును. అంతటితోఁ బోనీయక నీవు మహానురాగముతోఁ గురువృద్ధాదులందఱసమ్మతమున యుధిష్ఠిరుని యౌవరాజ్యాధికారిగ నొనర్చితివి, దానివలనఁ బురజనులు, దేశప్రజలు, బ్రాహ్మణోత్తములు ప్రధానులు మున్నగు వారందఱును నాతనియం దత్యంతానురక్తులై యున్నారు. వారందఱును నీవు జాత్యంధుఁడవగుటచే రాజ్యము నేల సమర్థుఁడవు కావనియు, భీష్ముఁడెక్కుడు సమర్థుఁడైనను మొదటనే రాజ్యము విడిచెననియు, మిగిలిన వారిలో ధర్మతనయుఁడే మిగుల గుణవంతుఁడును, ధర్మశీలుఁడును శూరులగు తమ్ములు గలవాఁడును నగుటచే రాజ్యార్హుఁడనియు, నతనినే యభిషిక్తునిగ నొనర్చిన వృద్ధామాత్యబంధుమిత్రాదులగు పూజ్యులనెల్ల మిగుల గౌరవించుననియుఁ, నిట్లువీనికి రాజ్యాధిపత్యము నిచ్చుటకు మంత్రివర్యుండగు విదురుఁడు కూడ నంగీకరించుననియుఁ, గాఁబట్టి తగిన యదనుచూచి యట్టి ప్రయత్నము తప్పక జరుగునట్లు చేయవలయుననియు నెప్పుడును దమలోఁ దాము నిర్ణయించుకొనుచుందురు. అట్టి పలుకులు నాచెవులఁ బడినప్పుడెల్ల ములుకులవలె మిగుల బాధించుచుండును. మానవంతులకు విరోధులయౌన్నత్యము సహింపరానిదిగదా? పాండవులిచట నుండునంతకాలమును బ్రకృతులకు వారిపై ననురాగము వృద్ధియగుచునే యుండును. కావున వారల నిచటనుండుట మాన్పి యెచటికైన దూరప్రదేశమునకుఁ బోవునట్లు నీవాజ్ఞాపింపవలయును."

అదివిని ధృతరాష్ట్రుఁడు "వత్సా! నీకిట్టి దురూహ యేల జనించినది. నేను సకలబలంబులు గలిగియు నంగవికలుండనగుటవలన రాజ్యపాలనమునకుఁ దగకయున్న యవసరమునందుఁ బాండురాజు నన్నుఁ రాజునుగానుంచి నాయందు మిగుల భక్తియుక్తుఁడై దిగ్విజయము సల్పి దేశము హస్తగతము చేసి బహుధనరాసులు గొనివచ్చి నాచే ననేకయజ్ఞములు

చేయించెను. అందుచే నన్నుఁ బ్రతిష్ఠించినది యాతఁడే యని చెప్పకతప్పదు. అట్టి మహోపకారికుమారులై, యతని కంటెఁగూడ గుణవంతులై విశేషించి జనానురక్తులైయున్న యీకుమారులను గృతఘ్నుఁడనై దూరదేశముల కెట్లు పాఱఁ ద్రోలుదును ? కనుక నిట్టిదుస్స్వభావమును విడిచి యైకమత్యముగలిగి వారితో మైత్రినెఱపుము" అని బ్రతిమాలెను.

దుర్యోధనుఁ డంతమాత్రముతో విడువలేదు. అతఁడు మరలఁ దండ్రితో నిట్లనెను "నాయనా ! కోపగింపకుము. నేను మనవిసేయు విషయములను జాగ్రత్తతో నాలకింపుము. మీపైతృకమగురాజ్యము పాండురాజునకు సంక్రమించెను గదా ? దాని నిప్పుడు మరల ధర్మజుఁడే పొందిన యెడలఁ గ్రమముగా నాతని సంతతివారలే రాజ్యపాలనమున హక్కు గలిగియుందురు, మేమును మాసంతతివారలును వారల యనుగ్రహమును గోరుచు నింతతిండితోఁ దృప్తినొందవలసినవారల మగుదుము. అట్టి హీనదశ మాకు రానిచ్చియుండిన యెడల నీయిష్టము వచ్చినట్లు ప్రవర్తింపుము." అని దీనముగా బహుభంగుల వేడుకొని యెట్టకేలకాతని నొప్పించి మంత్రులలోఁ దనకిష్టులగువారిని బిలిపించి 'మీరీక్షణమున నేగి పాండవుల కడ వారణావతమును బహువిధములఁ బ్రస్తుతించుచు నెట్లైన వారచట నివసించుటకు సమ్మతించునట్లు చేయుఁడని యాజ్ఞాపించెను. వారును నట్లొనర్చిరి.



కొన్నిదినములు గడచిన పిదప నొకనాఁడు ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరునిఁ బిలిచి దగ్గఱఁగూర్చుండఁ బెట్టుకొని కుశలాదుల నరసి నాయనా ! మీరు నాతమ్ముని కొమరులగుటచే నాకుఁ బరమాప్తులరు. ఇట్టి మిమ్ముల నొకకార్యమున నియోగించుచున్నాను. వినుము. వారణావతము సమస్తసుఖముల కాకరమై నివాసయోగ్యమైనదని వింటిని. మీరు జననీసహితులై వలయుపరివారముతో పశుపతినివాసస్థలమగుటచేఁ బావనమైన యచ్చోట నివసించి మీతండ్రియగు పాండురాజునకు హితముగా వలయుదానాదులచే భూదేవులనుఁ దృప్తిపఱచుచు నుండుఁడు. కొంతకాలమైన పిదప మరల రావచ్చును." అని యాజ్ఞాపించెను.

యుధిష్ఠిరాదులంతకు మున్ను మంత్రుల బోధవలనఁ గొంతకాలము వారణావతమున నివసింపనుత్సుకులై యుండుటవలనను బితాజ్ఞనుల్లఘింప నిచ్చగింపని వారగుటను నతని యాజ్ఞను బుష్పమాలికవలె శిరసావహించి గాంధారీధృతరాష్ట్రులకును భీష్మద్రోణ విదురకృపాదులకును మ్రొక్కి యనేక వృద్ధబ్రాహ్మణులకు నమస్కరించి వారలవలన దీర్ఘాయురారోగ్యములతోఁ బునర్దర్శనంబగునట్లు దీవనలనంది దుర్యోధనాదుల సందఱను బ్రియపూర్వకముగా వీడ్కొని వారణావతమునకుఁ బయనమై చనుచుండిరి. యుధిష్ఠిరుని విడువలేక పౌరులు వెంబడించుచుండ నాతండోదార్పుమాటలచేత వారలను దృప్తులనొనర్చి వీడుకొల్పెను.

పాండవులప్రయాణసమయమున దుర్యోధనుఁడు మిగుల సంతోషముతోఁ గడుచులుకఁగాఁ బనిచేయుచుండుటను విదురుఁడు చూచి యదియంతయు వాని తంత్రమువలననే జరిగినదని నిశ్చయించియుండెను. కనుకఁ బాండవులను సాగనంపుటకుఁ జాలదూరమువఱకుఁ బోయి యుధిష్ఠిరునితో "నాయనా! కడుబుద్ధిమంతుఁడవు సమస్తమును స్వయముగా నెఱవేర్చుకొనఁగలిగిన నిపుణుఁడవు. అయినను నాకుఁ దెలిసిన యొక యంశము నెఱిఁగించెదను. మన్నింపుము. ఇపుడు హస్తినగరమున సుఖముగా నున్న మిమ్ముల నకారణముగా ధృతరాష్ట్రుఁడు వారణావతమునకుఁ బంపుటలో నేదేని గొప్పకారణముండకపోదు. ఆతండచట మీకుఁ బ్రాణాపాయకరమగు నుపద్రవమేదైనఁ జేయింపక మానఁడు. కావున మీర లేమఱియుండక విషాగ్నులవలన బహుజాగరూకులై మెలంగుచుండుఁడు; నేనిచ్చటనుండి దుర్యోధనుఁడు రహస్యముగాఁ జేయించు దుష్కార్యములను నిపుణముగా గ్రహించి వానికిఁ బ్రతీకారమొనర్చుచుండెదను." అని యాతనిం గౌఁగిలించుకొని నమస్కరించి పాండురాజుం దలంచుకొని బాష్పపూరితనయనుఁడై విడువలేక విడువలేక విడిచి మరలిచనెను.

యుధిష్ఠిరుఁడు విదురునిబుద్ధికుశలతను దమయెడల నాతనికిఁగల యనురాగమును జననీ సహోదరులకు వర్ణించి చెప్పెను. కతిపయప్రయాణముల వారు వారణావతమును జేరుకొనిరి. పౌరులు వీరియాగమనమును సంతసముగా విచ్చి



యున్నత సౌధముల నధిరోహించి వీరినిదనివి తీరఁ జూచి యానందించిరి. వీరచ్చటికిఁ జనుటకు ముందే ధృతరాష్ట్రుఁడచట వీరి నిమిత్తమొక దివ్యమగు భవనమును నిర్మించియుంచుమని పురోచనుఁడను శిల్పకారుని నియమించెను. ఆసంగతి నెఱిఁగి దుర్యోధనుఁ డాతనిని రహస్యముగాఁ బిలిపించి కొంతధనము బహుమానముగా నిచ్చి నీవు కట్టుభవనము లక్కయు నూనెయుఁగలిపి పూతిపెట్టిన దారువులతోఁ గట్టి సమయము కనుపెట్టి పాండవు లాయింటిలోఁ జచ్చునట్లుచేసిన యెడల నింకను గొప్ప బహుమానము నిచ్చెదనని చెప్పియొడంబఱిచి పంపెను. ధనాశాపిశాచావేశపరవశుండై యాతఁడట్టి కృత్రిమభవనమును గడుసుందరముగా నిర్మించియుంచెను. యుధిష్ఠిరాదులు పురప్రవేశమొనర్చిన పిదపఁ గొన్నిదినములకు శుభముహూర్తమున నందుఁ బ్రవేశించిరి.

రాజనీతి విశారదుండును పరాభిప్రాయ నూహోపాయ ప్రయోగ విదుండునునగు యుధిష్ఠిరుఁడు శత్రుకల్పితములగు మాయోపాయములను జక్కఁగా గ్రహింపఁగలవాఁడగుట నాక్రొత్తయింటిని బహునిపుణతతోఁ బరిశీలించి దాని కృత్రిమరమణీయతను గ్రహించి మెల్లగా భీమసేనుం బిలిచి "తమ్ముఁడా! చూచితివా? యీగృహము సొంపు. మనపైనుండు దయచే ధృతరాష్ట్రుఁడు దీనినింత చక్కఁగాఁ గట్టింపలేదు. దీనిగోడలమధ్యభాగము లక్కతో నింపఁబడియున్నది.

దారువులన్నియుఁ దైలములోఁ దడుపఁబడియున్నవి. ఇంతే కాక యాయుధగృహమునకు సమీపముననే కూడఁ గట్టఁబడినది. కనుక నిది తప్పక యగ్నిప్రమాదము నొందుట కనువైనదని నిశ్చయింపవచ్చును. ఇట్టి ప్రమాదముముందు జరుగఁగలదని యెఱింగియే విదురుఁడు మనలను విషాగ్నులవలన జాగరూకులరై యుండుఁడని ప్రబోధించెను. కనుక మనము దీనిని నమ్మియుండరాదు. దీనియందుఁ దప్పక యగ్నిభయము సంభవించును." అని పలికెను. భీముఁడు దానికిఁ గోపము తెచ్చుకొని "అగ్రజా! ఇది యిట్టిదయినయెడల మనము మొదట విడిసినచోటఁ బ్రవేశించి పురోచనుని దీనియందుంచి మనమే దహించి పోవుదము" అని తొందరతోఁ బలికెను. అదివిని ధర్మతనయుఁడు "సహోదరా! ఇట్టి సందర్భములయందుఁ దొందరపడుట ధర్మము కాదు. దీని నిజస్థితిని మనమెఱిఁగినను నెఱుఁగనట్లు పురోచనుని కృత్రిమస్వభావమేర్పడువఱకును నిందే యుందము. ఈగృహవృత్తాంతమును మనమెఱిఁగినట్లు పురోచనుఁడు గ్రహించినచోఁ దన ప్రభువునాజ్ఞ విఫలము కారాదని తొందరపడి దీనిని దహించును. అదివిని యచట భీష్మద్రోణాదులు కోపింతురు. అందువలన నంతఃకలహములు సంభవించి కురుకుల సంక్షోభంబు గలుగును. ఇంతియు కాక దీనినుండి తప్పించుకొని మనమింకొకచోటి కరిగినయెడల నెఱిఁగి మన నాశమునే కోరు దుర్యోధనుఁడు మనకనేకములగు నపాయములను గలిగింప యత్నించును.



కనుకఁ బైకేమియు నెఱుఁగనివారివలె నటించుచు జాగరూకులమై సంచరింపవలయును." అని యొడంబఱచెను. నాఁటినుండియు వారేప్రొద్దును బవలెల్ల వేఁటనల్పుచు రాత్రులయందాయుధహస్తులై యప్రమాదులై యుండిరి.

అచట హస్తినాపురమున విదురుం డతికుశలంబున నెఱింగి దుర్యోధనుని దుస్తంత్రమును సంపూర్ణముగాఁ దెలిసికొని మిగుల విశ్వాసముగల యొక ఖనకునిఁ (ఉప్పరిని) బిలిచికొన్ని సంగతులను జెప్పి పాండవులకడకుఁ బంపెను. వాఁడు వారణావతమునకు వచ్చి యుధిష్ఠిరుని సందర్శించి వారుతన్ను నమ్మునట్లు కొన్ని గుఱుతులను దెలిపి రాఁగలశ్రావణబహుళచతుర్దశినాఁటి రాత్రి పురోచనుఁడు లక్కయింటి కగ్నినంటించును. గావున నప్పుడు మీరిందుండి తప్పించుకొను మార్గము నిర్మించుటకు విదురుని పంపున వచ్చితినని విన్నవించి లక్కయిల్లు వెలువడునట్లుగా నొక్కబిలము నెవ్వరు నెఱుఁగకుండు నట్లేర్పఱచెను. భీమసేనుఁ డామార్గమును బాగుగాఁ బరిశీలించియుంచెను.

ఇట్లుండ శ్రావణకృష్ణచతుర్దశి యేతెంచెను. నాఁడు కుంతీదేవి యాపట్టణము నందుండు బ్రాహ్మణులనుఁ బుణ్యాంగనలను రప్పించి మృష్టాన్నపానదానముల సంతుష్టులఁ గావించెను. ఆదినమున దేవపూజాదులు పూర్తిగాఁ జరుపఁబడినవి. అంతకుముందు నుండియుఁ బురోచనుఁడు నిషాదవనిత నొక

రితను పాండవుల కడకుఁ బంపి వారికృత్యములను దెలిసికొనుచుండెను. అది యెప్పటివలె నాఁడును వచ్చి యుత్సవమున దైవప్రేరణమున నత్యధిక మద్యపానమత్తయై తన పుత్రులైదుగురితోడ మైమఱచి లక్కయింటిప్రక్కనె పరుండి నిద్రించెను. పురోచనుండును వచ్చి పాండవులు గాఢనిద్రాపరవశులై యున్నతఱిని లేచి యగ్నినిడ నిశ్చయించి తాను ముందుగ నిద్రించెను. అది భీముఁడు కనిపెట్టియుండి తన జననీసహోదరులను ముందుగా బిలములోనికనిపి పురోచనుఁడు పరుండియున్న గృహద్వారమున నగ్నినంటించి ఖనకునకుఁ దమకుశలగమనం బెఱిఁగించి బిలమార్గమున జననీసహోదరులను గలిసికొని వారినిఁ దిన్నగా హిడింబుని వనమునకుఁ జేర్చెను.

చ॥ “అనుపమ నిత్యసత్యరతు♦లై వినయాన్వితులైన పాండునం
దనులకు ధర్మమూర్తులకు ♦ ధర్మువెలుంగక యిట్టు లెగ్గుసే
సినధృతరాష్ట్రజాధమున♦ శేషసుహృత్సుతబంధుదాహసూ
చనమయిలక్కయిల్ల తికృ♦శానుశిఖాహతిఁ గ్రాఁగె గ్రక్కునన్

లాక్షాగృహము దగ్ధమయ్యెను. పురోచనుఁడును బుత్రపంచక సమేతముగా నిషాదవనితయు దగ్ధులైరి. ప్రాతఃకాలంబునఁ బౌరులందఱును బుత్రసహితయగు నిషాదిని గుమారసమేతయైన కుంతియని పెక్కువిధముల వగచి యది తప్పక దుర్యోధన కల్పితమే యని యాతనిఁ బెక్కుభంగుల నిం



దించిరి. ఖనకుఁడు పౌరులతో వచ్చి తాను త్రవ్విన మార్గము కనఁబడకుండఁ జేసెను. ఖనకునివలనఁ బాండవుల సేమ మెఱింగి విదురుఁడు సంతసించెను. ధృతరాష్ట్రుఁడు కల్లవగపులు వగచెను. దుర్యోధనాదులు మిగుల సంతసిల్లిరి.

## నాలుగవ ప్రకరణము.

### ఉద్వాహము.

యుధిష్ఠిరాదులు ఖనకుఁడొనర్చిన సురంగమార్గము వెంట హిడింబాసురుని వనము బ్రవేశించిరి. భీముఁడు తప్పఁ దక్కిన యందఱును మార్గాయాసముచేఁ బడలియున్నందున నచటి యాకులపైఁ బరుండి గాఢముగ నిద్రించిరి. ఆసమయమున భీముఁడు తమ్ముహింసింపవచ్చిన హిడింబునిఁ జంపి యుధిష్ఠిరునియొక్కయుఁ దల్లియొక్కయు నానతి ననుసరించి యాతని చెల్లెలగు హిడింబను వివాహమయ్యెను. ఒక సంవత్సరకాలము వారచటనే యుండి యాసమీపమున నున్న శాలిహోత్రుఁడను మునిని సందర్శించి యాతనికడ ననేకమంత్రములు మున్నగునవి యుపదేశము నొందిరి. ఆసంవత్సరముననే హిడింబకు ఘటోత్కచుఁడు జన్మించెను,

పిమ్మట వారందఱు నచటనుండి బయలుదేరి యనేకదేశములు గడచి చని యేకచక్రపురమును నగ్రహారమును

జేరి యచట బ్రాహ్మణవేషధారులై సాధుకవృత్తితో జీవించుచుండిరి. లాక్షాగృహము దగ్ధమయినందున నందుఁ బాము కూడ దహింపఁబడిరని దుర్యోధనాదులెంతలెంచుచుందురనియు నిప్పుడు తాము మరల బయలుపడిన యెడల ధృతరాష్ట్రుఁడు మరల హస్తినాపురమునకు రమ్మని వర్తమానమంపునియు, నాతని యనుజ్ఞను ల్లంఘించుటకిష్టము లేనందున నచటికిఁ బోవక తప్పదనియు, నట్లు పోయిన యెడల మరల దుష్టచతుష్టయము వారు ఇటుపైన నివార్యములగు నాపదలు కలిగింతురనియు, నచటికేయేగి యస్థిమితమనంబులతో సర్పముల మధ్యమునందువలె వారిమధ్యమునుండి జీవించుటకంటెఁ దిరిపమెత్తుకొనియైనను స్థిమితముగా నుండుటయే మేలనియు బుద్ధిశాలియగు యుధిష్ఠిరుఁ డాలోచించియే యిట్టి యేర్పాటు చేసెను. భ్రాతృభక్తులగు భీమసేనాదులు దాని నంగీకరించిరి. చిరకాలమునుండి యాయగ్రహారప్రజలకు బీడించుచున్న బకాసురుని మహాబలశాలియగు భీమసేనుఁడు సంహరించి పురనివాసులకుఁ జెప్ప నలవికాని మహోపకారముఁ గావించెను. అనంతరము కొంతకాలము వఱకు నచటనే యుండిరి.

పాంచాలదేశపురాజగు ద్రుపదుఁడు అర్జునుని వివాహమాడు కన్యకను గనవలయునని యఖండముగ హోమాదులొనరించి యగ్నికుండమునఁ ద్రిలోకసుందరి యనఁదగిన కృష్ణ (ద్రౌపది) యను కుమార్తెను గాంచి యుండెను. ఆమె



సంజాతయౌవనయై వివాహయోగ్యవయస్సున నుండెను. అట్టి సమయమునఁ బాండవులు లాక్షాగృహమున దగ్ధులైరను ప్రవాదము ద్రుపదునికి వినవచ్చెను. దానికాతఁడు మిగుల విచారించి పురోహితవచన ప్రబోధితుఁడై యర్జునునికిఁ దప్ప నితరులకుఁ జూడనైన శక్యము కాని మత్స్యయంత్ర మొకటి కల్పించి క్రిందనుండు నద్దములో లక్ష్యముఁజూచుచు నాయంత్రము నెవ్వఁడు గొట్టునో యాతనికి ద్రౌపదినిచ్చి వివాహము చేసెదనని దేశములవెంటఁ జాటఁ బంపెను. ఆవార్త పాండవులకుఁ దెలిసినయెడల వారు తప్పక రాకపోరని యాతని యూహ.

ద్రౌపదీస్వయంవరవృత్తాంతము పాండవులకుఁ దెలిసెను. అర్జునునకీస్వయంవరమునకుఁ బోవలయునని యెక్కువ కుతూహలము కలిగెను. అది కుంతి కనిపెట్టి యాతనికోరిక నెఱవేఱునట్లు చేయవలెనని యెంచి కుమారుల నందఱను జేరఁ బిలిచి "పాంచాలదేశము సుభిక్షముగా నుండునని వినుచుందును, కావున నచటికిఁ బోయి కొంతకాలము గడుపవలెనని నాకుఁ గుతూహలముగా నున్నది." అని పలికెను. తల్లిమాటకుఁ బుత్రపంచకము మిగుల సంతసించెను. మఱునాఁడే వారందఱును బయలుదేరి ద్రుపదుని రాజధానియగు కాంపిల్యనగరమున కేగి నివురుఁగప్పిన నిప్పులవలె, మసిపాతఁగట్టిన మాణిక్యముల పోలికఁ బ్రచ్ఛన్నముగాఁ బేద బ్రాహ్మణవేషములతో నొక కుంభకారుని యింటఁ బస చేసిరి.

స్వయంవరమహోత్సవమును గన్నులారఁగాంచి యానందించుటకును మత్స్యయంత్రమును బడఁగొట్టి జగన్మోహినియగు ద్రౌపదిని జెట్టఁబట్టుటకును గుతూహలురై దేశముల రాజులందఱును దమకుఁగల మహావైభవములతో ద్రుపదరాజ పురమునకు వచ్చిరి. కౌరవులు యాదవులు జరాసంధాదులు మున్నగు సందఱును విచ్చేసిరి. వారివారి చతురంగసైన్యముల కోలాహలముతోఁ బట్టణమంతయు మిగుల సంకులమై యుండెను. కాంపిల్యనగరనివాసులందఱును ద్రౌపదీస్వయంవర సందర్శనలాలసులైయుండిరి. పురమెచ్చటఁజూచినను బాగుగా నలంకరింపఁబడి నిత్యకల్యాణము పచ్చతోరణమునై యానందనిలయమైయుండెను.

స్వయంవరదినము వచ్చెను. తదర్థమై నిర్మింపఁబడిన విశాలచతుశ్శాలకు నృపకుమారులందఱును వచ్చి యుందలియాసనములపై సమాసీనులైరి. ఒకవైపున బ్రాహ్మణ మండలము నిండియుండెను. ముందుగా ధృష్టద్యుమ్నుఁడు వచ్చి స్వయంవరనియమముల నుపన్యసించెను; అతనివెనుకనే ద్రౌపది శుభ్రమాల్యాంబరాది విభూషితయై యొక్క పూలమాలిక కేంగేలఁగైకొని సఖులు గొలువ వచ్చి నిలిచెను. రాజకుమారులందఱు నామె సౌందర్యామృతమును గన్నులారఁ గ్రోలి క్రోలి యట్టి జగదేకసుందరి నెట్లయినఁ బడయువలయునను పూనికతో నొక్క రొక్కరుగ లేచి రంగస్థలమునకువచ్చి కొందఱు ధనువును గదల్పలేకయు, మఱికొందఱెక్కు పెట్టలేకయు నింక కొందఱు లక్ష్యమును నిల్పలేకయు, వితథప్రయత్నులై లజ్జావనత శిరస్కులై స్వస్థానములకుఁబోయి చేరిరి. విప్రవేషధారియగు నర్జునుఁడు బ్రాహ్మణబృందమధ్యమునుండి లేచి రంగస్థలమును జేరి చూపరుల కచ్చెరువు కలుగునట్లు వింటనమ్ముఁ దొడగి యంతరిక్షమునం ద్రేలాడు యంత్రమునందలి మత్స్యమూడి క్రిందఁబడునట్లు కొట్టెను. వెంటనే పాంచాలరాజతనూజ మందమందగమనంబునఁ జని పార్థునికంఠసీమ పుష్పమాలికచే నలంకరించెను. అదిచూచి యోర్వలేక కర్ణుఁడు మున్నగువారు లేచి యర్జునునితో జగడము సలిపిరి. ఆపోరాటమున విజయునకె జయము సమకూడెను.



అచటఁ గుమ్మరివాని యింటనున్న కుంతి తనకుమారులు రావలసిన వేళతప్పుటకు వగచుచుండ, పార్థుఁడు ముందుగా సంతోషముతో లోపలికి వచ్చి తల్లికి నమస్కరించి "అమ్మా! యీదినమున మాకుమంచి భిక్షముదొరికినదని" పలికెను. అది యథార్థపు భిక్షయేయని తలంచి కుంతి "నాయనా! దానిని మీరందఱును సమానముగాఁ బంచుకొనుఁడని యానతిచ్చెను. ఇంతలో యుధిష్ఠిరాదులు నలువురును ద్రౌపదితోఁ గూడ వచ్చి యామెకు నమస్కరించి జరిగినవృత్తాంతమంతయు నెఱిఁగించి యామెనుజూపిరి. తల్లి తెల్లపోయెను. ఆమె యధర్మభీతయై ధర్మాధర్మవిచక్షణుండగు జ్యేష్ఠపుత్రుని

యుధిష్ఠిరునిఁజూచి జరిగిన వృత్తాంతమువివరించి యింతకుముందు నాపలుకెన్నఁడు నసత్యము కాలేదు. మీరును నాయాజ్ఞ మీఱలేదు. కాని యిది మాత్రము లోకవిరుద్ధము. ఏమిచేయుటకును నాకేమియుఁదోఁచుటలేదు. అనిపలికెను. యుధిష్ఠిరుఁడు పార్థునిఁ జూచి యీమెనునీవు నిజసామర్థ్యమునఁబడసితివి. కావున నీవే యగ్నిసాక్షికముగాఁబాణిగ్రహణము చేసికొనుము. అదియే యుత్తమధర్మము. అనియాజ్ఞాపించెను. దాని కతఁడంగీకరింపక జ్యేష్ఠులవివాహితులై యుండఁ గనిష్ఠులు వివాహమాడుట ధర్మవిరుద్ధముకాదా? కావున మామనవి నంగీకరించి యగ్రజుండవగు నీవే యీమె నగ్రమహిషినిగా స్వీకరింపుము. మానలువురయభిమతమగు నీకార్యమున కంగీకరించి మన్నింపుము. అని పరిపరి విధములఁ బ్రార్థించెను. యుధిష్ఠిరుఁ డంగీకరింపలేదు. అట్లయినఁ దల్లి యనుమతిప్రకార మైదుగురును వివాహమాడుటయే శ్రేయము. అని యర్జునుఁడు పట్టుపట్టెను. ఎట్లయిననేమి? తుదకు యుధిష్ఠిరాదు లేవురును నామెను వివాహమాడుటకు నిశ్చయించిరి.

స్వయంవరసమయమున వీరు చూపిన యత్యద్భుత పరాక్రమమునుజూచి బలరామకృష్ణులు వీరు తప్పక పాండవులై యగుదురని నిశ్చయించి క్రమముగా వారినివాసము తెలిసికొని యచటికి వచ్చి కుంతీధర్మసుతులకు నమస్కరించి తమకు మ్రొక్కిన భీమసేనాదులనుఁ గౌఁగిలించుకొని సంతుష్టులై పరస్పరము కుశల ప్రశ్నాదులఁ గావించుకొనిరి. దుర్యోధనాదులకు భయపడి ; దూరదేశములకేఁగి బీదబ్రాహ్మణవేషములనుధరించి యున్న మమ్ములను మీరెట్లెఱింగితిరని యుధిష్ఠిరుఁడువారినిఁబ్రశ్నింప వాసుదేవుఁ డుసుందహాసమొనర్చుచు.

ఉ॥ అంబుజమిత్రుఁ డంబుదల♦వాంతరితుండగుచుం దదీయతే
జంబుజగజ్జనంబులకు ♦ శక్యమె కప్పఁగ? మీరుగూఢ భా
వంబుననున్న మీదగున♦వారిత తేజము భూజనప్రసి
ద్ధంబగుఁగాక దానిఁబిహి ♦ తంబుగ నెవ్వరుఁ జేయనేర్తురే?

సకలరాజసమక్షమున నిట్టి యతిమానుషము, అత్యద్భుతము, అతిదుష్కరమునునగు కృత్యముసేయుట కర్జునకేగాని యితరుల కశక్యము. కావున గుర్తించితిని. మీపరాక్రమమే మిమ్ములనెఱిఁగించెఁ. ఇటుపయినిమీకు శుభములు చేకూఱునని పలికి వారి వీడుకోలువడసి బలరామసహితుండై చనెను.

నిరుపమాన నైపుణ్యముచూపి యట్లు తన కొమరితచే వరింపఁబడిన యాతేజోరాశి యథార్థచరిత్రము తెలియక ద్రుపదుఁడు కళవళపడి తెలిసికొనిరమ్మని కుమారుఁడగుధృష్టద్యుమ్నునింబంపెను. ఆతఁడు ప్రచ్ఛన్నముగానేఁగి వారియాచారవర్తనాదుల నరసివచ్చి బ్రాహ్మణక్షత్రియులలో నొకజాతివారగుదురనితండ్రికి విన్నవించెను. ద్రుపదుఁడింకను బరీక్షించుటకై తనపురోహితునిఁబంపెను. అతఁడునువచ్చివీరిచేఁ బూజితుండై వీరియథార్థకుల శీలాదులనుగూర్చి ప్రశ్నింప యుధి

ష్ఠిరుఁడునప్పుడుఁ దమవృత్తము తెలియఁబడకుండ అయ్యా! మీరాజు చెప్పినప్రకారము యంత్రమత్స్యమును బడవేసినారము. ఇఁక మాకులశీలాదులతో మీప్రభువున కేమిపని? తెలిసినమాత్ర మిప్పుడేమిచేయఁగలుగును? పరాక్రమహీను లట్టి పనిచేయఁజాలరుగదా? మీరాజయత్నము సఫలమయ్యెనది. ఇఁక విచారింపనేల?" అనిపలికెను. అతఁడు సెలవుఁగైకొని చని యుధిష్ఠిరుని వచనక్రమము పార్షతున కెఱిఁగించెను. అంతమాత్రమున నాతఁడు వారిచరిత్రము నిర్ణయింపనేరక యుక్తిగాఁ జాతుర్వర్ణ్యోపయోగోచితములగు రథము లాయత్తపఱచి వానితో వారలనుగొనిరమ్మని ధృష్టద్యుమ్నునిఁబంపెను అపుడు పాండవులు క్షత్రియార్హములగు స్యందనముల నధిరోహించి ద్రుపదునాస్థానమునకుఁ జనుదెంచి నిశ్శంకముగా కొదమసింగములవలెవచ్చి క్షత్రియార్హములగు నాసనంబులపై నాసీనులైరి. అప్పుడు ద్రుపదయుధిష్ఠిరుల కిట్లు సంభాషణముజరిగెను.

ద్రు॥ అయ్యా! మీరుక్షత్రియులో బ్రాహ్మణులో లేక మాయవేషములనుధరించి చరించు మంత్రసిద్ధులో కాక కృష్ణాస్వయంవరార్థము మహినవతరించిన దివ్యులో యెఱుంగఁజాలకున్నాము, మీయథార్థవృత్తముల నెఱిఁగించినయెడల నీకన్యను వివాహముచేయుదును.

యు॥ మేముక్షత్రియులము. పాండుమహారాజవరేణ్యుని



ప్రియపుత్రులము. నేను పెద్దవాఁడను వీరునలువురును భీమార్జున నకులసహదేవులు.

"ఆహా! నేను మిగుల ధన్యుఁడను. నాపుణ్యవశమున మీరు లాక్షాగృహమునుండి విముక్తులైతిరి, నాకులము పావనమయ్యెను. విచిత్రవీర్యునికి మనుమఁడును జగద్విఖ్యాతముగ మహేంద్రునివరమునఁ గుంతీమహాదేవికి జన్మించిన వరప్రసాదియు సార్థకనామధేయుఁడునగు నీవిజయుఁడు నాపుత్రికి భర్తయయ్యెను. నేనుఁ గృతార్థుఁడనైతిని. స్వయంవరలబ్ధయగు నీకన్య నర్జునునికిచ్చి వివాహము సేయఁగోరియున్నాను.

"అదియెట్లు సంగతమగును? నేనును భీమసేనుండును బరిణయముల నొందిన పిదపఁగదా యవరజుఁడగు నర్జునుఁడు వివాహమాడుట. మొదటనే యాతని కెట్లువీలగును?"

"అట్లయిన యెడల నీకన్యను నీవే పరిణయమగుము."

"నేనొక్కరుఁడనే కాదు, మేమయిదుగురమును వివాహమాడెదము, ఇది మాజననియాజ్ఞ. అవిలంఘనీయము.

"(విస్మితుఁడై) ఒకపురుషున కనేకభార్యలుండుట ధర్మముగాని పలువురుపురుషులకొక్క భార్యయుండుట యే యుగములందునుఁ గనివిని యెఱింగిన విషయము కాదు. నీవు లౌకికవైదిక సర్వధర్మస్వరూపవేత్తవు. ధర్మదేవతయగు యమునివరమున జన్మించిన మహానుభావుఁడవు. నీపలుకులు ధర్మవిరుద్ధ

ములగుటకు సాహసింపఁజాలను. ఇప్పుడు నాకేమియుఁ దోఁచుటలేదు."

"నీకెంతమాత్రమును సంశయింప నవసరము లేదు.

చ॥ "నగియును బొంకునందువచనంబునధర్మవునందుఁజిత్తముం
దగులదు నాకు నెన్నఁడును ♦ధర్మమవశ్యము నట్లకావునన్
వగవక మాకు నేవురకు ♦ వారిజలోచనఁ గృష్ణ నీఁదగుం
దగదను నీవిచారములు♦దక్క వివాహ మొనర్పు మొప్పగాన్"

పూర్వము గౌతమవంశజుఁడగు జటిలుండను ఋషికూతురు తపఃప్రభావంబున నొక్కతెయే యేడుగురుఋషులకు భార్యయయ్యెను. దాక్షాయణియనుమునికన్య ప్రచేతసులకుఁ బదునొక్కండ్రకు సతియయ్యెను. ఇట్టి పూర్వగాథలనేకములు గలవు. గురువులందఱలోఁ బరమగురువు మాతృదేవత. ఆమెయానతి విధాతృకృతమువలె మీఱరానిదిగదా!

"అయిన నీవిషయమునఁ గృష్ణద్వైపాయనుల యభిప్రాయ మెట్లుండునో?

"ధర్మతత్త్వవిదుండగు నీధర్మసూనుండు ధర్మమార్గము తప్పువాఁడుకాఁడు. కుంతియుఁ బొరపాటు పడునది కాదు, వీరలమాటలును దేవతలమతములును నొక్కటియే, కావునఁ దప్పక యేవురకు నీకొమరితనిచ్చి వివాహముఁ గావింపుము."

అని కృష్ణద్వైపాయనుండాతనికిఁ బంచేంద్రోపాఖ్యానంబు చెప్పి ద్రౌపదికిఁ బూర్వజన్మమున నైదుగురు భర్తల



బొందువరముండుటను దెల్పి యుధిష్ఠిరుఁడు కోరినప్రకారము తప్పక జరిగింపుమని చెప్పెను. ద్రుపదుఁడు సంతుష్టుండై యొక్క శుభముహూర్తమునఁ బాంచాలి నాపంచవరులకు నిచ్చి క్రమముగా వివాహకృత్యములు నెఱవేర్పించెను. అల్లురందఱకును దగినరీతిగ నరణములొసంగి గౌరవించెను. ద్రౌపది యత్తకు నేవురుభర్తలకు బహువిధశుశ్రూషలొనర్చుచు ముదంబుఁ గూర్చుచుండ వారందఱును నచట నొకసంవత్సరకాలము నివసించిరి.

---

## అయిదవప్రకరణము.

---

### రాజ్యప్రాప్తి మయసభ.

పాండుకుమారులు వారణావతమునలాక్షాగృహమునఁబడి మరణింపలేదనియు లక్ష్యభేదన మొనర్చి ద్రౌపదిని వివాహమాడి మహాబలవంతుఁడగు ద్రుపదునితో బాంధవ్యము నొంది మహావైభవమున నున్నారనియు దుర్యోధనునిచారులు వచ్చి చెప్పిరి. ఆసంతోషవార్త తెలిసి కురువృద్ధులు గురువులు పౌరులు మున్నగువారందఱును మహానందమునొందిరి. విదురుఁడు పూర్వమే యీసమాచారము నెఱింగియున్నను నప్పుడువినినట్లే నటించుచు మిగులహర్షముఁ జూపెను. దుష్టచతుష్టయమువారికి ధృతరాష్ట్రునకు మాత్రమది మఱింత విచారకా

రణమయ్యెను. స్వయముగనే బలవంతులై శూరసత్తములగు యాదవులకుఁ బరమాప్తులై యున్న పాండవులకుఁ దమయందఱకు నసాధ్యుఁడై తఱిమి పంపిన ద్రుపదునితో సంబంధము కుదురుటచూడ "గోరుచుట్టుపై రోఁకటిపోటు" పడినట్లయ్యెను.

పాండవపాంచాలురు కలిసియుండకుండఁ జేయుట కుపాయముతోఁచక కర్ణదుర్యోధనులొకనాఁడు ధృతరాష్ట్రుని కడకుఁబోయి పాండవులయభ్యుదయ మాతని కెఱిఁగించి యెట్లైన వారిని పాంచాలునివద్దనుండి విడఁదీయుట మంచిదని చెప్పిరి. దానికుపాయము తోఁపకయే నేను నూహించుచున్నానని యాతఁడనెను. చతురంగబలసమేతముగాఁ బోయి వారిని జయించి బంధించుట తగునని బాహుబలధౌరేయుఁడగు రాధేయుఁడు సలహా చెప్పెను. అది మిగిలినయిరువురకు సమ్మతముకాదయ్యెను.

భీష్మద్రోణులును మహాత్ముఁడగు విదురుండును వారి దురాలోచనలను బూర్తిగాఁ దెలిసికొని తగినసమయము చూచి "రాజా! నీవు సుతప్రేరణమున ముందుఁగానక సంచరించుచున్నావు. దాన మీవంశమంతయు నశించును గాని వేఱు కాదు, నీకత్యాప్తులగు పాండవులను దురాలోచనతో లక్కయింటఁ జావనెంచి యిచటనుండి తొలఁగించి పంపితివి. అదృష్టవశమున వారు బ్రదికి బయలుపడఁగా నిప్పుడును నసూయాపరుఁడవై వారి కపాయము చేయఁజూచుచున్నావు.



వారునిరుపమానపరాక్రమవంతులు, ఒక్కొక్కరును నసాధ్యులు. దేవతలకైన వారల నెదిరించి గెలువ శక్యము కాదు. కావున నిట్టి దురాలోచనల నిఁకఁగట్టిపెట్టి సామమున వారిని బిలిపించి "లక్కయింటఁ బెట్టి దహింపనెంచితి"వని లోకులచే నీయందారోపింపఁబడిన యపవాదము తొలఁగునట్లు వారి కర్ధరాజ్యమొసఁగి నీపుత్రులతోఁ బాటు ప్రేమతోఁ జూచుచుండుము. లేనిచో మీకుఁ గుటుంబకలహము తప్పక సంభవించును" అని గట్టిగా మందలించిరి. ధృతరాష్ట్రుఁడిఁకఁ జేయునది లేక వారి యిష్టానుసారముగఁ జేయుట కంగీకరించెను.

పిదప ధృతరాష్ట్రుఁడు విదురునిఁ బంపి పాండవులను గుంతీద్రౌపదులతోఁ గూడ రప్పించి వారిని బహువిధముల బహూకరించి యుధిష్ఠిరున కర్ధరాజ్యమిచ్చెదనని సింహకొలువునందు వాగ్దానమొనర్చెను. పాండవులు సజ్జనులుగనుక గౌరవులు పూర్వము తమకొనర్చిన దుండగములను మఱచి వారలతోఁ గలసి మెలసి యుండిరి. అయిదు సంవత్సరములయిన తరువాత ధృతరాష్ట్రుఁడు తనవాగ్దానప్రకారము గురువులు కురువృద్ధులు శ్రీకృష్ణబలరాములు మున్నగునందఱిసమక్షమున శ్రీయుధిష్ఠిరునర్ధరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁగ నొనర్చెను. పిదప శ్రీకృష్ణుని యాజ్ఞాప్రకారము ఇంద్రుఁడు పంపఁగావచ్చిన విశ్వకర్మ సకలశుభలక్షణసమన్వితంబగు నింద్రప్రస్థమను దివ్యమగుపురమును నిర్మించెను. యుధిష్ఠిరుఁడు

సోదరులు తల్లియు ధర్మపత్నియు వెంటరా నచటికేగి దానినే రాజధానిగా నొనర్చుకొని మహావైభవముతో రాజ్యమును పాలించుచుండెను.

ఇంద్రప్రస్థపుర సౌందర్యవిభవములకు నమరావతి మున్నగు పట్టణరాజములన్నియు నీడుకాకుండెను. ధర్మజుని రాజ్యమునఁ బ్రజలీతిబాధలు లేక సుఖముగాఁ బరమానందము ననుభవించుచుండిరి. అచటి బ్రాహ్మణోత్తములు యజనాది షట్కర్మనిరతులై తపోమహిమ నలరారుచుండిరి. ఇతరవర్ణములవారందఱును దమతమవృత్తులను విడువక పరస్పరానురాగముతో దేవబ్రాహ్మణభక్తితోఁ వరలుచుండిరి. రాజ్యమునం దెచ్చటఁ జూచిన నుత్సవములు సంతర్పణములు మున్నగువానితోఁ బ్రజలు పరమసంతోషనిమగ్నులై యుండిరి. పాడియుఁ బంటయు మిగుల సమృద్ధములైయుండెను. సకాలమునకు సస్యానుకూలముగా వర్షములు గురియుచుండెను. తరులతాదులు పుష్పఫలభరితంబులై యలరారుచుండెను. వేయేల? ప్రకృతియంతయుఁ గలకలలాడుచు నానందమయమై కన్పట్టుచుండెను. పాండవులు పరస్పరానురాగ పరిపూర్ణహృదయులై యలరారుచుండిరి. నారదమహర్షి వారియొద్దకు విజయము చేసి సత్కృతుండై యేకపత్నీకారణంబున వారు పరస్పరము గలుషమానసులు కాకుండ బోధించియరిగెను.

ద్రౌపదిని వివాహమాడినప్పటినుండియుఁ బాండవులు తమలోనొకఁడంతఃపురముననుండఁగ నితరుఁడచ్చటికేగినయెడ



నట్టివాఁడొక సంవత్సరము తీర్థయాత్ర బ్రహ్మచర్యములనాచరింపవలయునని నియమము చేసికొనియుండిరి. ఒకనాఁడొక పేదపాఱుని పశువులను దస్యులు హరించుచుండ నాతఁడు వచ్చి మొఱపెట్టఁగఁ గనికరముకలిగి యర్జునుఁడు లేచి విప్రులబాధ తీర్పకుండుట పాపహేతువని ధర్మరాజు ద్రౌపదీసమేతముగా నాయుధాగారమున నుండుట తానెఱింగియు విప్రునియందలి జాలికతమున నాగృహమునఁ బ్రవేశించి యాయుధములను గైకొని గోవులనువిడిపించి బ్రాహ్మణునికర్పించి తానుయుధిష్ఠిరునికడకేగి తననియమాతిక్రమణము నెఱిఁగించి తీర్థయాత్రకుఁ బోవుటకుఁ దనకనుజ్ఞనిమ్మని వేడుకొనెను. అర్జునుఁడు బ్రాహ్మణ సంరక్షణతత్పరుండై వచ్చెనుగాని దురుద్దేశముతో రాలేదని యుధిష్ఠిరుఁ డెఱుఁగును గావునఁ దమ్మునితో.

గీ॥ క్రూరకర్ములయ్యు ♦ గోబ్రాహ్మణులకగు
బాధ లుడుచు జనుల ♦ పాపచయము
లెట్టివాడలఁ బొంద ♦ వింద్రనందన నీకు
సమయభంగభీతిఁ ♦ జనఁగ నేల?"

పరిపాలకులు తస్కరులను వధింపనియెడల మహాదోషము కలదు. అట్టిచో దుష్టశిక్షణంబొనర్చి బ్రాహ్మణహితంబొనరించిన నీకుఁ బ్రాయశ్చిత్తమనవసరము. అని ఖండితముగాఁ జెప్పెను. కాని యర్జునుఁడంగీకరింపక పరిపాలకులగు తామే నియమోల్లంఘనము చేయుటతగదని యగ్రజు నొప్పించి

తీర్థయాత్రకుఁ జని పాండ్యరాజకూఁతురగు చిత్రాంగదను బరి
ణయమై ద్వారక కేఁగి యచట మేనమామ కొమరితయగు
సుభద్రను వివాహమాడి కొంత కాలమునకు మరల నింద్ర
ప్రస్థమున కేఁగుదెంచెను.

ఒకప్పుడగ్ని దేవుఁడు శ్వేతకేతువను రాజు చేసిన యజ్ఞ
మందలి హోమాదులననుభవించుటవలన నజీర్ణరోగపీడి
తుఁడై బ్రహ్మయనుమతిపై నింద్రుని ఖాండవవనమును దహిం
పఁగోరి నరనారాయణుల యవతారపురుషులగు పార్థ వాసు
దేవులకడకువచ్చి తనయిచ్ఛ నెఱింగించి మహేంద్రుఁడడ్డము రా
కుండఁ దావనమును దహించుటకుఁ దగిన సహాయముఁ
జేయవలయునని కోరగా కృష్ణార్జును లావీతిహోత్రున కభయ
వరంబొసంగి వనము దహించుట కనుజ్ఞనీయ నగ్ని హోత్రుఁ
డు ఖాండవవనదహనమున కుపక్రమింప నింద్రుఁ డాసంగతి
దెలిసికొని తనయధీనము నందున్న పుష్కలావర్తక మేఘముల
నుబంపివనము కాలిపోకుండ ననేక ప్రయత్నములు జరిగించెను.
కానియవన్నియు వ్యర్థములయ్యెను. అగ్ని హోత్రుఁ డావన
మును బూర్తిగాఁ గాల్చివైచెను.

ఆవనమున నివసించియుండు మయుఁడను విశ్వకర్మ
పార్థునియనుగ్రహంబున దవానలంబునఁబడి మడియకుండ
సంరక్షితుఁడై కృష్ణార్జునులతో నింద్రప్రస్థమున కేతెంచి
పాండవులయెడఁ దనకుఁ గల కృతజ్ఞతను దీర్చుకొనఁగోరి ధర్మజ
నికొలువునకు వచ్చి మహారాజా ! మీయనుజన్ముఁడు నాకుఁ
బ్రాణదానము నొనరించెను. మీకుదిరిగి యుపకారము చేయఁ
దగినంతటివాఁడనుగాను. అయినను "ఉడతభక్తి" చూపి నాచే



తనైనది కావున నొకయద్భుతశిల్పము నొనర్చి సమర్పించుకొని
యెదను. ఏది యిష్టమో ఆజ్ఞాపించిన నన్నుఁ గృతార్థుం జేయుఁడని
విన్నవించెను. యుధిష్ఠిరుఁ డేమిచేయుటకును దోఁచనందున శ్రీ
కృష్ణునందులకు నియోగించెను. ఆమహనీయుఁడు బాగుగ
నాలోచించి యుధిష్ఠిరుని వైభవమునకుఁ దగినదియు సకల
లోకపాలురసభలను మించినదియు నగు సభాభవనము నొక
దానిని నిర్మించి సమర్పింపుమని మయునకు నియోగించెను.

మయుఁడామాటలకు మిగుల సంతసించి పూర్వమున
వృషపర్వునికై సభను నిర్మించుటకై సమకూర్చి యామని యాగి
పోవుటవలన బిందుసరస్సునందు దాచినరత్నదారువులు మున్న
గువాని నుపయోగించి మైనాకపర్వతప్రదేశమందుఁ బదునా
లుగుమాసములు మిగులశ్రమతోఁ బ్రయత్నించి యపూర్వ
మగు విమానమువంటి సభాభవనమును నిర్మించెను. అది
మనోహరములగు నుపవనములతోడను, రమణీయములగు
జలాశయములతోడను, నానారత్నమయ కుట్టిమస్థలములతో
డను, సుందరసాలభంజికాసహస్రంబులతోడను, జగదేకసుం
దరమై యలరారుచుండెను. వానినైపుణ్యమేమోకాని దాని
యందు నీరులేనిచోట నున్నట్లును ద్వారము లున్నచోట లేన
ట్లును లేనిచోట నున్నట్లును గన్పట్టుచుండెను. ఎంతబుద్ధి
మంతులైననుఁ గ్రొత్తగాఁ జూచినవారల కాభవనము
మతిభ్రమను గలుగఁజేయుచుండెను. సభానిర్మాణము పూర్తి

రైన వెంటనే మయుఁడు దానిసెనిమిది వేలమంది మహాబలశాలులగు రాక్షసవీరులచే మోపించుకొని యింద్రప్రస్థనగరమునకుఁ గొనివచ్చి యచట నుచితప్రదేశముననుంచి యుధిష్ఠిరునకర్పించి భీమునకు గదయు నర్జునునకు శంఖమును నొసంగి వారిచే సత్కృతుండై యథేచ్ఛముగ నేగెను.

యుధిష్ఠిరుఁడు దైవశక్తిసంపన్నులగు దైవజ్ఞులవలన నిర్ణయింపఁబడిన శుభముహూర్తమునందు ధౌమ్యాదిభూసురవరులచేఁ బుణ్యాహవాచనం బొనర్పించి పదివేలయుత్తమద్విజులకు సంతృప్తిగా భోజనములను బెట్టించి గోదానాదిషోడశమహాదానంబులు నొనర్చి వారిమనఃపూర్వకాశీర్వాదముల నంది పత్నీసోదరసమేతముగా మయనిర్మితసభయందు గృహప్రవేశము నొనరించెను.

ఉ. మంచిగ భూరిభూసుర • సమాజము నెల్లను భక్తితోడఁ బూ
జించి యభీష్టదానములు • సేసి ధనార్థులఁ దన్ని దిక్కులన్
నించె యశంబు బంధులకు • నెయ్యురకుం హృదయప్రియం
బుగా
పంచె విభూతి యేర్పడఁ బ • విత్రుఁడు ధర్మసుతుండు నెమ్మి
తోన్

ఆఱవప్రకరణము.

రాజ్యాంగపద్ధతి.

రాజనీతివిశారదుండగు యుధిష్ఠిరరాజన్యావతంసుండు తన నూతన ప్రభుత్వమున రాజ్యాంగములను జక్కఁగ సంస్కరించి తన పూర్వులవలెనే కడునిపుణతతో రాచఱికము నెఱపుచుండెను. ధర్మార్థకామములను వాని వాని నియమముల ప్రకారము పరస్పరసాంకర్యము లేకుండ సేవించుచుండును. అపరరాత్రమున లేచి రాఁగలదినమునందుఁ దా నొనర్పవలసిన ధర్మనిర్ణయములను గూర్చి మిగుల విమర్శనాబుద్ధితో నాలోచించుచుండును. నిపుణులగు వారినే రాజోద్యోగపదవులయందు గౌరవముగా నియమించెను. పితృపితామహక్రమముగా వచ్చుచు నీతిశాస్త్రకోవిదులై తనయందత్యంతానురక్తులయిన వారిని మంత్రులనుగా నియోగించెను. విజయమూలమగు తనమంత్రాలోచన మషట్కర్ణముగా నుండునటుల మిగుల జాగరూకుఁడై కాపాడుచుండును. ధర్మాధర్మనిర్ణయచణుఁడును బహుశ్రుతుండును బండితవర్యుఁడును నగుధౌమ్యుని బురోహితునిఁగా నేర్పఱచుకొనెను. యజ్ఞాదులను నిర్వర్తించు ప్రయోగనిపుణుండగు నొకద్విజసత్తముని యాజ్ఞికుఁడుగా నేర్పాటుచేసికొనెను. సకలవిధరణవిద్యావిచక్షణులు, నమేయపరాక్రములును, గడువిశ్వాసపాత్రులును, దనకు హితకాంక్షులును నగువారిని సేనాధిపతులనుగా నిర్ణయిం

చెను. ఆరాజచంద్రుని యాస్థానమునందలి దైవజ్ఞులు తమశాస్త్రదృష్టిచే రాజునకు సంభవించుదివ్యాంతరిక్షభౌమోత్పాతములను దెలిసికొని వెంటనే తగిన ప్రతీకారములను జేయుచుందురు. వైద్యులష్టాంగసహితమగు నాయుర్వేదమున దక్షులై శారీరకరుజల నతినిపుణతతోఁ బరిహరించుచుందురు. అంతఃకరణశుద్ధులై పాపక్రియాపరాఙ్ముఖులై వినీతవర్తనులగు వారిని కరగ్రాహకులుగా నియోగించెను. మనుజుల యుత్తమమధ్యమాధమతలను బాగుగాఁ బరిశీలించి వారివారికిఁ దగిన భృత్యపదవుల నొసఁగుచుండును. వారి భృతులను సకాలమున వారికిచ్చి సంతుష్టిపఱచుచుండును. మహావీరులై రణరంగములయందుఁ దనకత్యంతోపకారులై వృద్ధులైన వారి కుపకారవేతనముల నొసంగుచు వారి యుద్యోగములను వారి కుమారులకొసఁగి యాదరించుచుండును. తన నిమిత్తము యుద్ధములందుఁ బ్రాణములను విడిచి రాజభక్తి చూపిన భృత్యులకుటుంబము వారికిఁ దగిన వసతుల నేర్పఱచి యాదరముచూపుచుండును. ధనలుబ్ధులు, మూర్ఖులు, దనయందుఁ బ్రేమలేనివారు, శత్రుపక్షమువారు, ధైర్యహీనులు నగువారలను రాజకార్యములకు నియోగింపక వారియెడలఁ జాగరూకుఁడై ప్రవర్తించుచుండును. ఆతనిరాజ్యకాలమునఁ జోరకిరాతాదుల బాధ లేశమైన లేకుండెను. తనభృత్యులు చోరులతోఁగూడి భాగములను గ్రహించుచు వారినేరములను గప్పిపుచ్చకుండ



మిగుల జాగరూకతతోఁ గనుపెట్టుచుండును. కఱవులు గలుగకుండుటకై ప్రతిగ్రామమునందును బెద్దచెఱువులు త్రవ్వించి వానివలన సస్యములభివృద్ధిగాంచు నేర్పాటులు విశేషముగఁ జేసెను. పేదలగు రైతులను గనుపెట్టి వారి పోషణమునకు ధాన్యము వ్యవసాయమునకు విత్తనములు నిచ్చుచుండెను. వర్తకులు వ్యాపారమునకై కోరినపుడు శతైకవృద్ధిగా (నూటికొక రూపాయిచొప్పున వడ్డితో) ఋణముల నిచ్చి సాయపడుచుండెడివాఁడు. బధిరపంగ్వంధమూక వికలాంగానాథులకు నన్నపానములు నిత్యము దొరకుటకుఁ దగిన సత్త్రముల నేర్పఱచెను.

ధర్మజుఁడు తనకెంతటి శత్రువైనను శరణుజొచ్చినపుడు వాని పూర్వాపరాధములను మన్నించి రక్షించును. తనకు బహూపకర్తలగు నుద్యోగులను నిండుకొలువున బహుమానాదులచే గౌరవించి వారిభక్తి నినుమడింపఁజేయుచుండును. ఆయుధాగారము ధనాగారము మున్నగు వానియందుఁ బరమవిశ్వాస్యులగు భటులను నియమించి యుంచెను. గురువులు, వృద్ధులు, శిల్పులు, బంధుజనులు, ఆశ్రితులు, సాధువులు మొదలగు వారికిఁ బేదఱికపుబాధ లేకుండఁ గనుపెట్టి పోషించుచుండును. నిత్యమును నమాత్యులు, బంధువులు, గురువులు, మూలబలములవారు, రాజపుత్రులు, విద్వాంసులు పరివేష్టింపఁగొలువుండి న్యాయాన్యాయవిచారణ సలుపుచుండును.

నిపుణులగు చారుల నెల్లదిక్కులకును బంపి బాహ్యాభ్యంతర జనులయొక్కయు శత్రురాజులయొక్కయుఁ బ్రవర్తనములను దెలిసికొనుచు వారలవలనఁ దనకేబాధలును గలుగకుండ జాగ్రత్తతోఁ గాపాడుకొనుచుండెను.

వేదములను జదివినందులకు ఫలమగ్నిహోత్రాదులను సరిగా నిర్వర్తించుటయనియు, ధనమున్నందులకు లాభము దానభోగములే యనియు, శాస్త్రపఠనమునఁ గలుగు ఫలితము సద్వర్తనమే యనియు, జక్కఁగా నెఱింగి యాయావిధులను సరిగా నెఱవేర్చుచుండెను. తనదుర్గములు బహుధనధాన్యములతో, నాయుధసహితులగు వీరవరేణ్యులతో, నీటి సముపాయములతోఁ గూడినవై తృణకాష్ఠజల సమృద్ధిగలిగి యుద్ధోపయోగములగు ననేక యంత్రములు గలిగి శత్రుజనదుస్సాధ్యములై వెలయు నేర్పాట్లుచేయించెను. యుద్ధమునకు శత్రురాజులపైకి దండెత్తిపోవునపుడు ముందుగ నిపుణులగు వారిని బంచి సామాద్యుపాయములచేతనే వారిని వశపఱచుకొను ప్రయత్నములు చేయుచుండును. వేయేల? ఎట్టి ప్రయత్నములవలనఁ దనకుఁగాని ప్రజలకుఁగాని బాధలు కొంచెమైన నుండక సంపూర్ణసంతుష్టిగలుగునో యట్టి పనులనెల్లఁ జేయుచు నెచటఁ జూచినను దేశము ప్రశాంతమై యుండునట్లొనరించెను.



ఉత్తములగు రాజులకుండఁదగని నాస్తిక్యము, అనృతము, ప్రమాదము, ఆలస్యము, అనర్థజ్ఞులతోడి మంతనము క్రోధము, దీర్ఘచింత, దీర్ఘసూత్రత, జ్ఞానులనెఱుఁగకుండుట అర్థములయందనర్థచింత, నిశ్చితకార్యముల నాచరింపకపోవుట, మంత్రములను రక్షింపకుండుట, శుభముల నాచరింపకుండుట, విషయాసక్తియను పదునాలుగు దోషములు లేకుండ బహునైపుణ్యముతోఁ బరిపాలనము చేయుచుండెను.

## ఏడవప్రకరణము.

### రాజసూయము.

సకలసద్గుణగరిష్ఠుండగు యుధిష్ఠిరుఁడు మయనిర్మిత సభామంటపమధ్యమున మంత్రిబాంధవసామంతపురోహితాదులు కొలువ నిండుకొలువున నుండ బ్రహ్మదేవునికి మానసపుత్రుఁడును, జగత్త్రయసంచారియుఁ, దపఃప్రభావసంపన్నుఁడు గలహాకల్పనావిశారదుండును నగునారదుండేతెంచి యామహనీయునిచే విధ్యుక్తవిధానమునఁ బూజింపఁబడి వారిని గుశలంబడిగి యాసభాభవనము నలువలంకులఁ గలయంబరికించి దాని సొబగునకు మిగుల సంతసించి యష్టదిక్పాలకుల సభలకంటె నదియే యెక్కువ సుందరముగ నున్నదని మెచ్చుకొని ప్రసంగవశమున "యుధిష్ఠిరా! భవజ్జనకుండు స్వర్గలోకం

బునఁ గుశలియై యున్నవాఁడు. నీవు రాజసూయయాగంబును జేసి దిగంతవిశ్రాంతమగు యశస్సును సంపాదించిన యెడలఁ దనకు మిక్కిలి సంతోషము గలుగునని నాతోఁ జెప్పియున్నాఁడు. ఉత్తమగుణసంపన్నుండవగు నీకుఁ బిత్రాజ్ఞాపరిపాలనము ముఖ్యముగదా?" యని చెప్పి యథేచ్ఛం జనియెను.

ఆయుపదేశము యుధిష్ఠిరునకు మిగుల సంతోషావహ మయ్యెను. తనరాజ్యము సస్యసంపత్సమృద్ధమై యగ్నిచోరరోగాది బాధలులేక సుభిక్షమై యుండుటయు, కోశాగారము పరిమితరత్నరజత సువర్ణపరిపూర్ణమై యుండుటయు, సమస్తవస్తుపరిపూర్ణమై కోష్ఠాగారముండుటయు, మహాయాజ్ఞికు లందఱుఁ దన యభ్యుదయమే కోరుచుండుటయుఁ గాంచి యదియ తనకుఁ దగిన యదనని మదిని నిశ్చయించెను.

అతఁడు యజ్ఞమునకు వలయు ప్రయత్నములు సలుపుచు వాసుదేవుని రమ్మని వర్తమానమంపి యీ మహనీయుఁడేగుదెంచిన వెంటనే తనపూనిక నెఱుంగంబలికి దీని విషయమున నీయభిప్రాయ మేమి యని యడిగెను. శ్రీకృష్ణపరమాత్మ యాతని యుద్యమమునకు సంతసించి "ధర్మనందనా! రాజసూయమహాధ్వర మవశ్యము చేయఁదగిన యోగ్యత నీకుఁ గలదు.

ఉ॥ "పూజ్యుఁడ వెల్లవంశముల • భూపతులందును ధర్మనిర్మల
ప్రాజ్యవిభూతి నద్దివిజ • పాలకు నట్టిఁడ నీక యొప్పె సా
మ్రాజ్యము దైవసంపదయు • మానుషసంపద పేర్మి కాపునన్
యాజ్యుఁడ విప్డు నీవభర • తాన్వయభూషణ ధర్మనందనా."



సకలదేశముల రాజులను జయించిన యాతఁడు గాని దానిని జేయనర్హుఁడు కాఁడు గదా? రాజులందఱును నీకు లొంగి యున్నారని తలంపకుము. మగధదేశాధీశ్వరుండగు జరాసంధుఁడు నీకు లోఁబడక పక్కలో బల్లెమువలె బలవంతుఁడై యున్నవాఁడు. అతఁడు రాజులందఱను జయించి తన రాజధాని యగు గిరివ్రజపురమున బంధించి దినమున కొకని బలివెట్టుచు భైరవదేవు నారాధించుచున్నాఁడు. అతనిని జయించిన పిదప నేగాని నీవా యజ్ఞము నాచరింపఁజాలవు. వాని సేనానాయకులు కడునేర్పరులు. వానిని జయించుట దుస్సాధ్యము. అయినను భీమార్జునులను నాతోఁ బంపిన యెడల నెట్లయిన నాతనిం గడతేర్పించు నుపాయ మాలోచింతు" ననిపలికి యతనిచే ననుజ్ఞాతుఁడై భీమార్జునసమేతముగా గిరివ్రజపురము సొచ్చి భీమునిచే భుజాబలధురంధరుండగు జరాసంధునిఁ బరిమార్పించెను. అర్జునుం డుత్తరకురుభూములకు వెడలి మహాతేజులగు రాజులను గెల్చి తన యన్నకు లొంగియుండున ట్లేర్పఱచెను. నకులసహదేవులు పశ్చిమదక్షిణదిక్కులను జయించి వచ్చిరి. భీమసేనుండు పూర్వజగదీశులవశపఱచుకొని వచ్చెను. మొత్తముపై నాసేతుశీతనగపర్యంతమహీతలపరిపాలకులలో స్నేహసంబంధమువలన శ్రీకృష్ణుని ప్రదులు

దక్కఁ దక్షిణ మహారాజులెల్ల యుధిష్ఠిరానుజులపరాక్రమమునకు వెఱచి వినమ్రులై యనేకోపాయనము లొసంగి లొంగి యుధిష్ఠిరుని యాజ్ఞానువర్తులై యాతండొనర్చు రాజసూయమునకు వచ్చి యచటఁ బరిచర్య సేయుట కంగీకరించిరి. శైలకానన ద్వీపవిశాలమైన వసుమతీ చక్రమంతయు ధర్మజునికి స్వాధీనమయ్యెను.

గౌడకాంభోజదేశాధీశులు నానావిధములగు రత్నకంబళాదులును ఆకుపచ్చని రంగుగల హయవతంసములను దెచ్చి సమర్పించిరి. సింహళకేరళ చోళ పాండ్యరాజ పుత్రులు పగడములు ఏలాగురుచందనములు గొనివచ్చి యిచ్చిరి. శ్రీకృష్ణుఁడు పదునాలుగు వేలమదగజములను బంపెను. విరాటద్రుపదాదులు తమతమ యర్హతలకుఁ దగిన గజాదులను గొనివచ్చిరి.

దైవజ్ఞ నిర్ణీతమగు శుభముహూర్తమున రాజసూయ మహాధ్వరము కొనర్చుటకు నిశ్చయింపఁబడెను. యజ్ఞశాలయు దానిచుట్టు నితర గృహంబులును మిగుల రమ్యముగా నిర్మింపఁబడి సకల వస్తుచయసంపూరితములయ్యెను. వచ్చిన వారలందఱకును జనుల కొఱకనేకగృహములు నిర్మితములయ్యెను. విరాటద్రుపద శిశుపాల గాంధారరాజులు వసుదేవ బలరామ ప్రద్యుమ్నాది యదువృష్ణి భోజాంధకవరులు మున్నగు భూమండలంబునంగల యందఱు రాజులకు నితరులగు



బంధుమిత్రాదులకు బ్రాహ్మణ శ్రేష్ఠులకు వైశ్యశూద్రవరులకు నాహ్వాన పత్రిక లంపఁబడెను. భీష్మద్రోణ విదుర ధృతరాష్ట్రాదులను దోడ్కొని వచ్చుటకు నకులుఁడు స్వయముగాఁ జనెను, అందఱును యథాకాలమునకు వచ్చి తమకు నిర్ణీతములగు ప్రదేశములందు విడిసిరి.

యుధిష్ఠిరుఁడు భీష్మద్రోణాదుల నెల్ల వారివారి యర్హతల ననుసరించి పూజించి వారలను యథాశక్తిగాఁ దనకు సహాయపడునట్లు ప్రార్థించి వారి యనుగ్రహము సంపాదించి హిరణ్యరజతములు రత్నములు దక్షిణలు వీనిని సంగ్రహించి జాగ్రత్త పెట్టుటకుఁ గృపాచార్యులను, నిర్ణీతకార్యములు సక్రమముగా జరుగునట్లు చేయుటకు భీష్మద్రోణులను వలసిన వస్తువులను ధనాదులను బంచి యిచ్చుటకు విదురుని నానాదేశముల రాజులు తెచ్చియిచ్చుకానుకలు గ్రహించి భద్రపఱచుటకు దుర్యోధనుని, భక్ష్యభోజ్యాదులను దృప్తిగా వినియోగించుటకు దుశ్శాసనుని నియమించెను. నారాయణుఁడు యజ్ఞరక్షకుఁడై యెక్కడఁ జూచిన నక్కడఁ దానయై యన్ని పనులను లోపములేకుండ నిర్వర్తింపించుచుండెను. సర్వమును సంసిద్ధమయ్యెను.

ధర్మజ్ఞుఁడగు ధర్మనందనుఁడు యజ్ఞదీక్షవహించి విప్రులు జ్ఞాతులు మిత్రబాంధవులు పరివేష్టించి కూడ వచ్చుచుండ మహాతేజముతో శుభదినమున యజ్ఞాగారమునఁ బ్రవేశిం

చెను. సకాలమునకు యజ్ఞమారంభింపఁబడెను. అధ్వర్యుఁడు ఉద్గాతృఁడు హోతమున్నగువారందఱును సంసిద్ధులైరి.

ఉ॥ "సమ్మదమంది చూచిరి భృశంబుగ భూజనులెల్ల బ్రహ్మతే
జమ్మును రాజతేజమును సద్బహుభూషణ రత్నరాజి తే
జమ్మును విస్తరించుచు నిజద్యుతి యొప్పఁగ మూర్తమైనధ
ర్మమ్మును బోలెచున్న గుణమండితుదీక్షితు ధర్మనందనున్॥

రు రాజవరేణ్యుఁడగు నాతఁడు కుబ్రహ్మవేత్తలగుఋషులతోఁగూడియుండి చూపరులకుబ్రహ్మర్షిగణపరీతుండగు బ్రహ్మవలెఁ దోచుచుండెను, వేదాధ్యయననినాదము బ్రాహ్మణాశీర్వాదరవము మంగళవాద్యముల ధ్వనియు నేకమై సముద్రధ్వనివలె నుండుటచే నచటివారు పరస్పరాభిప్రాయములను సంజ్ఞల మూలముననె దెలిసికొనుచుండిరి.

ఆయజ్ఞమునకు వేదవిదులగు పైలధౌమ్యులు హోతలుగాను; యాజ్ఞవల్క్యుఁ డధ్వర్యుఁడుగాను, ద్వైపాయనుండు బ్రహ్మగాను, సుసాముఁ డుద్గాతగాను, వీరి శిష్యులు మిగలిన ముఖ్యాంగ నిర్వాహకులుగాను, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగాను; భీష్మాదిరాజర్షులు సహాయులుగాను నుండిరి. యజ్ఞమునం దేలోపములు లేకుండ షడంగసమృద్ధమై యుండెను. దక్షిణలు సంపూర్ణముగా నొసంగఁబడెను. మంత్రపూర్వకములగు నాహుతులచే సకల దేవతలును, దక్షిణలు సంతృప్తిగా నొసఁగుటవలన భూసురోత్తములును, సముచిత



సత్కారములచే సమస్త రాజమండలమును, నిష్టమృష్టాన్న ప్రదానంబున భూమిగల యితర జనములును సంతృప్తులైరి. లక్షమంది భూసురోత్తములు సంతృప్తిగా భుజించిన యెడల నొక్కమారు తనంతటఁదానె మ్రోయుశంఖము ఆయజ్ఞము జరిగిన యన్నిదినములు నొక్కనిమేషమయిన విడువక ధ్వని చేయుచుండెను. యాజ్ఞసేని యజ్ఞసందర్శనేచ్ఛంజనుదెంచిన చతుర్వర్ణముల వారిని బీదసాదయనుభేదము లేకుండ నందఱను సమాన దయతోఁ బరిశీలించుచు నన్నపానాదులొసంగి యందఱును భుజించిన వెనుక నర్ధరాత్రమునఁ దాను భుజించుచుండెడిది. ఆయజ్ఞము కృతయుగమున హరిశ్చంద్రచక్రవర్తి యొనర్చిన రాజసూయముతో సమానముగా నున్నదని పురాణమునివరులు సంతోషించిరి. వచ్చిన ఋషులు భూసురులు మున్నగు నందఱు ననుజనమేతుండగు యుధిష్ఠిరుని బహువిధముల సంస్తుతించి యాశీర్వదించిరి.

అవభృథసమయమున ధర్మతనయుని నారద పారాశర్యాది మహామునులును ధౌమ్యుఁడును సశేష తీర్థముల జలములతో నభిషేకము గావించిరి.

యాగాంతమున యుధిష్ఠిరుఁడు మందాకినీనందనుం గాంచి మఖాంతమునఁ జేయఁదగిన సభాపూజ కెవ్వరర్హులో సెలవిమ్మని యడిగెను. దానికి భీష్ముఁడు "దుష్టశిక్షణ శిష్టరక్షణల రూపమున ధర్మస్థాపనకై లోకానుగ్రహార్థము భూమి

పై నవతరించిన సాక్షాన్నారాయణుఁడగు శ్రీకృష్ణపరమాత్మ ప్రత్యక్షదైవమై యెదుటనుండ నెవనిని బూజింపవలయునని యడుగనేల? అతఁడే యజ్ఞరూపుఁడు. యజ్ఞసంరక్షకుఁడు. యజ్ఞభోక్త. యజ్ఞఫలప్రదాత. సర్వలోకమాననీయుఁడు. అతనిఁ బూజించుట ముల్లోకంబుల వారికిం దృప్తి గలిగించుట. కావున నామహనీయునిఁ బూజింపు"మని చెప్పెను. తన యిష్టానుసారమే ధర్మవేత్తయగు భీష్ముఁడు పలుకుటకు యుధిష్ఠిరుఁడు మిగుల సంతసించి విధివిధానంబున వాసుదేవునిం బూజించెను.

శ్రీకృష్ణునికి మేనత్తకుమారుఁడైనను బాల్యము నుండియు శత్రువును దుర్వినీతుండును నగు చేదిదేశాధీశ్వరుఁడగు శిశుపాలుఁడు దేవకీనందనునిఁ బూజించుటకు సహింపక క్రోధపూరిత మానసుండై శ్రీకృష్ణ భీష్మయుధిష్ఠిరులను మిగుల దూషించెను. ధర్మజుం డతనిని మంచిమాటలతోఁ దేర్పనెంచెను గాని యట్టి ప్రయత్నము వ్యర్థమయ్యెను. శిశుపాలుఁ డూరకుండక వాసుదేవుని నోటికి వచ్చినట్లు దూషించుచు నాతని గుణములను గూడ దోషములుగా నిరూపించుచు నొడలు తెలియక సభాభవనమంతయు నల్లకల్లోలము చేసెను. భీముఁ డాతని సంహరింతునని లేవఁబోఁగా భీష్ముఁ డతనికి శిశుపాలుని జన్మవృత్తాంతము తెల్పి యతఁడు కృష్ణుని చేతనే హతుఁడగు ననెను. శిశుపాలుని దూషణలు మేరమీరుటవలన వాసుదేవుఁడు తన చక్రాయుధమున నాతని శిరము ఖండించెను.



సభాసదులందఱును గృష్ణుని జయజయ ధ్వనులతో సంస్తుతించిరి. యజ్ఞము నిర్విఘ్నముగఁ బరిసమాప్తమయ్యెను. మఱియు సభామంటపమునఁ గాంచన సింహాసనాసీనుండగు యుధిష్ఠిరునకు సాత్యకి ముత్యములగొడుగు పట్టెను. భీమార్జునులు చామరములు వీచిరి. శ్రీకృష్ణుండును నకులసహదేవులును ధృష్టద్యుమ్నుఁడును నాసేతుశీతాచలమధ్యభాగమునందలి సమస్త సామంతరాజవీరులచే మ్రొక్కించిరి. ఆసమయమున ధర్మనందనుఁడు బ్రహ్మవిదులగు నెనుబదియెనిమిది వేలమంది బ్రాహ్మణోత్తముల కగ్రహారము లొసంగెను. అతఁడు దినదినమును దనపంక్తిని బంగారు పాత్రములందుఁ బదివేలమంది యుత్తమ బ్రాహ్మణులకు భోజనములు పెట్టించెను. యజ్ఞసమాహూతులగు నితర రాజవరేణ్యులు దంపతులను, తురంగమసంతతులను, రత్నములను, గాంతారత్నములను సమర్పించి యాతని పాదరాజీవములకుఁ బ్రణతులైరి. కృష్ణద్రోణభీష్మవిదురాదులగు వారెల్లరును మిక్కిలి సంతోషించిరి.

కొన్ని దినములట్లు మహామహోత్సవముతో గడచెను. యజ్ఞసమాహూతులగు ప్రభువరులెల్లరును నొక్కదినమున యుధిష్ఠిరుని సందర్శించి యాతని మహత్త్వవైభవములను మనసారసంస్తుతించి రాజసూయ మహోత్సవ సందర్శనంబునను దమ కాతఁడు చేయించిన సత్కారగౌరవంబులకును దాము పొందిన యానందమును విన్నవించి యింక దాముతమ

తమ నిలయముల కేఁగుట కనుజ్ఞ నడిగి ప్రియురల నతనిచే బహూకృతులై చనిరి. శ్రీకృష్ణపరమాత్మ ద్వారకానగరమున కేఁగుచుఁ గొన్ని నీతులు గఱపెను. యుధిష్ఠిరుఁడు మిగుల సంతసించి యాతని కరుణవలననే తాము నిర్విఘ్నముగ యజ్ఞసమాప్తి నొనర్చి జగన్నుతకీర్తిఁ గాంచఁ గలిగితిమని వినయముగఁ బలికి తన కృతజ్ఞతను వెల్లడించెను. కృష్ణుఁడు బయలుదేరి చనిన యనంతరమునఁ బాండవులాతని రథము దృష్టిగోచరమగునంత వఱకును నిలిచి చూచి పిదప దీనమతులై యెట్లో గృహముల కేఁగిరి.

## ఎనిమిదవప్రకరణము.

### రాజ్యభ్రంశము.

ధృతరాష్ట్రాదులు కొన్ని దినములవఱకు నింద్రప్రస్థపురమున యుధిష్ఠిర కృత సత్కారముల నందుచు సుఖంబుండి పిదప భీమసేనుండు తమ్ము దిగఁబెట్టుటకుఁ గూడరాఁ గరినగరంబునకుఁ జనిరి. దుర్యోధనుఁడును శకునియు మాత్రము సభాభవన విశేషములను బూర్తిగాఁ జూడవలయునని యచటనే కొంతకాలముండిరి. ఒక్కనాఁడు దుర్యోధనుఁడు సభాభవనము నలువంకల సంచరించి చూచుచు దాని యపూర్వ రామణీయకత కచ్చెరువందుచు మూసియున్న ద్వారమును దెఱచి యున్నదని భ్రమించి చొరఁబోవ లలాటమునకు



దెబ్బ తగిలెను. నీరు లేనిచోట నున్నదని తలంచి వస్త్రము నెగఁగట్టుకొని నడచెను. జలమున్నచోట లేదనుకొని ముందు నకేఁగ కట్టువస్త్రము తడిసిపోయెను. పాంచాలియుఁ బాండుకుమారులును వానిభంగపాటునకు నవ్విరి. అభిమానధనుండగు దుర్యోధనున కది మిగుల నవమానకరముగాఁ దోఁచెను. ధర్మవిదుండగు యుధిష్ఠిరుఁడు మాత్రము వారల కృత్యముల కంగీకరింపక చాల నొచ్చుకొని భీమసేనునిచే దివ్యవస్త్రముల నాతనికిఁ బంపి మిగుల గౌరవించెను. కాని యంతమాత్రమున దుర్యోధననికి మనస్సంతుష్టి కాలేదు. మీఁదుమిక్కిలి రాజసూయసమయమున సకలదేశాధీశులును దెచ్చి సమర్పించిన మణికాంచనాద్యుపాయనములను జూడ వానికిఁ గన్నుకుట్టెను. పెక్కేల? యుధిష్ఠిరుని మహావైభవమాతని కసూయాజనకమయ్యెను.

కొలఁదిదినములలో శకునితోఁగూడ దుర్యోధనుఁడింటికి వచ్చెను. మనోవ్యాధిచే నాతఁడు నానాఁటికిఁ గృశింపసాగెను. ముఖము కళ తప్పెను. కన్నులు తేజమును దొరఁగి గుంటలువడెను. రక్తము క్షీణించుటచే నెముకలు బయటఁబడెను, రాజ్యకార్యములనువిడచి మిత్రులతోఁ గలియక సకలభోగవిముఖుఁడై యితరులతో మాటలాడుటకూడ మానివేసెను. శకుని యిదియంతయుఁ గనుపెట్టి మెల్లఁగా నాతనికడఁ జేరి తత్కారణ మడిగి తెలిసికొని శరీరము స్పృశించి యోదార్చుచు సుయోధనా! ఇంతమాత్రమున కింతచింత యేల? యుధిష్ఠిరుఁడు జా

దమునం దాసక్తి గలవాఁడు. వానినెట్లైన నిచటికిరప్పించి జూదమాడింతువేని కపటపుజూదమున నిమిషములో వానినోడించి వానిరాజ్యసంపదయు గెలిచి నీకిత్తును. ముందు మీజనకునికడకుఁబోయి యాతనితోఁ జెప్పి ధర్మజునిఁదమ్ములతో నిచటికిరప్పింపుము. పిదప నేనేయంతయుసాధింతును"అనిమేనల్లునియుల్లమలరఁబలికి యాతని ధృతరాష్ట్రునికడకుఁ దోడ్కొనిపోయి యాతనికిఁ గుమారునియాధివ్యాధులను దత్కారణములను విన్నవించెను. అదివిని ధృతరాష్ట్రుఁడులికిపడి సుయోధనుని దేహమంతయుఁ దడవిచూచి "నాయనా! నీకింతవంతయేల? పాండవులకంటె నీవేయైశ్వర్యవంతుఁడవు. అతనికంటె నెక్కువవైభవముగా నీవును యజ్ఞము నాచరింపుము. అతనికంటె నెక్కువగా సకలదేశాధీశ్వరులునుగానుకలుకొనివచ్చి నీకుసమర్పింతురు. కనుక నూరడిలియట్లుచేయు"మని యూరడించెను. అంతమాత్రమున కాతండూరడిలక "తండ్రీ! యట్లుకాదు. పాండవులసంపదలనుజూచుచు నేను సహించియుండలేను. మామామ యుధిష్ఠిరునితో జూదమాడి వానిరాజ్యమునంతను గెల్చి నాకొసంగును. దీనికి నీవంగీకరింపుము. నాముద్దుచెల్లింపకతప్ప"దని బ్రతిమాలెను. ధృతరాష్ట్రుఁడు కుమారుని యవస్థనుగాంచిమారుమాటాడలేక "సరియే; యట్లేచేయు"మని యంగీకరించెను.



ధృతరాష్ట్రునియనుజ్ఞచే మయసభనుమించు దివ్యమగు నొకగొప్ప సభాభవనము నిర్మింపఁబడెను. అదిపూర్తియైన వెంటనే యాంబికేయుఁడు విదురునిఁబిలిచి యీనూతన సభాభవనమున నాకుమారులు నాతమ్మునికుమారులతోఁగలసి సుహృద్ద్యూతమునఁ గొంతవడికిఁ గాలక్షేపము చేయఁగోరుచున్నారు. అందులకే యీభవనమును నిర్మింపించితిని. నీవింద్రప్రస్థపురమునకరిగి పాండుకుమారులను బిలుచుకొని రమ్మనెను. విదురుఁడును భీష్ముఁడును ననేకవిధముల జూదము వలనఁగుటుంబకలహము కలుగుననియుఁ బెద్దవాఁడవగునీకిదితగదనియు ధృతరాష్ట్రునికి నొక్కిచెప్పిరి. కాని యాతఁడామాటలను బెడచెవిని బెట్టెను, తప్పనిదనియగుటచే విదురుఁ డింద్రప్రస్థమునకుఁబోయి యుధిష్ఠిరునిదర్శించి "ధృతరాష్ట్రుఁడు తనకుమారులతో సుహృద్ద్యూతమాడుటకు నిన్నుఁదోడ్కొని రమ్మనెనని విన్నవించెను. ధర్మజుండది తమకుఁ బరస్పరము భేదకారణంబగునని సందేహించియు విధినియోగంబునను బెద్దలయనుజ్ఞనుమీరరాదనియు సతీసహోదరసమేతముగాజననిందోడ్కొనివిదురునితోఁ గరినగరంబున కేగుదెంచెను.

దుర్యోధనాదులు మనోగతములగు నన్యాయములు బయలుపడనీయక పాండవులను మిగుల నాదరముతో గారవించి రొకనాఁడు భోజనానంతరమున సుఖాసీనులై యున్నసమయమున నెయ్యపుజూదమునకు యుధిష్ఠిరునిఁ బురికొల్పిరి. వాని

కతఁడు జూదము క్షత్రియనీతిసమ్మతము కాదనియుఁ బాపకారణ
మనియు విశేషించి కుటుంబకలహజనకంబనియు నందునుమా
యాకితవులతో జూదమాడుటవలన ధర్మార్థహాని సంభవించు
ననియు సప్తవ్యసనములందును దగులకుండుట రాజనీతిగనుకఁ
దనకది సమ్మతము కాదనియు నుడివెను. అందుపై శకుని నీకుఁ
జేతఁగాకపోయిన యెడలఁగాని, యోడిపోవుదు నన్న భయముండి
న యెడలఁగాని యాడనక్కరలేదు. లెమ్మని సాక్షేపముగాఁ
బలుకుటవలన నతఁడు రోషముఁదెచ్చుకొని ద్యూతమువలనఁ
గలుగుదోషములనెఱిఁగియు మనసునందిష్టము లేకున్నను దైవ
ప్రేరణమున నాటకు సంసిద్ధుఁడయ్యెను.

దుర్యోధనుఁడు తానుస్వయముగా జూదమాడక తన
మేనమామయుఁ గపటకృత్యనిపుణుఁడును నగుశకునిని దనప
క్షమున నాడుటకు నియోగించెను. శకుని యుధిష్ఠిరులు జూద
మున కారంభించిరి. ఆరంభించుట మొదలుకొని యంతమువఱ
కును యుధిష్ఠిరప్రభువరుం డన్నిపందెములను నోడిపోవుచుం
డెను. తనయాభరణములు, గుఱ్ఱములు, యేనుఁగులు, రథములు
వాహనములు, నాయుధములు, ధనము, దేవబ్రాహ్మణవృత్తులు
దక్కఁ దక్కినసమస్తరాజ్యమును గ్రమముగా నొడ్డియోడిపో
యి రోషపరవశుండై మైమఱచి తమ్ములను దన్నుఁ దుదకు శకు
ని ప్రేరణమున ధర్మపత్నియగు పాంచాలినిగూడ నొడ్డియన్ని
పందెములను నోడిపోయెను. పాపము! ఆతనికిఁక నొడ్డుటకేమి
యు లేక లజ్జావనతవదనుండై యూరకుండెను. ఆతనియోట



మికి భీష్మద్రోణవిదురాదులు మిగుల విచారించిరి. సభయంతటను
గలకలధ్వని బయలుదేరెను.

కఠినహృదయుండగు దుర్యోధనుఁడు ద్యూతమున నోడి
చేయునది లేక దీనవదనులై యున్న పాండవులకుఁ బ్రస్తుతమునఁ
గావించిన యపకారము చాలక యవమానముకూడఁ జేయ
నెంచి వారుధరించియున్న యాభరణములను నాయుధములను
విడువ నాజ్ఞాపించెను. ధర్మబద్ధులై పాండునందనులట్లే చేసిరి.
దురాత్ముండగు దుర్యోధనుండంతతో విడువక యుధిష్ఠిరుఁడు
ద్యూతంబునఁ బాంచాలినిగూడ నోడెనుగానఁ దనకు దాసి
యయ్యెననియాపెను సభామంటపమునకు లాగికొనిరమ్మని
చండశాసనుండగు దుశ్శాసనుని నియోగించెను. అతిక్రూర
మనస్కుండగు వాఁడించుకయు సంకోచమునొందక యంత
రానిస్థితియందుంటిననియు, గురుజనాధిష్ఠితంబగు సభకు రానొ
ల్లననియు, ద్రౌపది యెంతయాక్రోశించుచున్నను విడువక
బలాత్కారముగా నగ్నికుండమున జన్మించినదియుఁ, బరమపవి
త్రయుఁ, బరమవీరులగు పాండవుల పట్టమహిషియు నగునామె
సమీపమునకేగి రాజసూయయజ్ఞాంతస్నానపావనమగు కేశ
పాశమును బట్టి సభాస్తారులచ్చెరువంది చూచుచుండ నిండుసభ
కీడ్చుకొనివచ్చెను. సహోదరుఁడు తనయానతి నెఱవేర్చినందు
లకుఁ జాలసంతసించి సుయోధనుఁడు పతులవస్త్రములనువలె
నాపెవలువనుగూడ నొలువుమని మరలఁ బురికొల్పెను. దురా

చారములలో నన్నును మించిన దుస్ససేనుఁ డన్న యానతి శిరసావహించి లజ్జాసంశయములనుద్యజించి వేలకొలఁది రాజకుమారులు గురువృద్ధాదులుం గనుచుండ యాజ్ఞసేనివస్త్రములను విప్పదొడంగెను. ముల్లోకములను గెలువఁజాలిన భుజాబలసంపన్నులగు నాథులున్నను ననాథవలెఁ బాంచాలరాజపుత్రి భయార్తయై యార్తజన శరణ్యుండగు యాదవవరేణ్యునిఁ దలంచి మానరక్షణమునకై ప్రార్థించెను. శరణాగతరక్షకుఁడగు శ్రీకృష్ణునను గ్రహమున దుశ్శాసనుఁడొక వస్త్రమును విప్పినఁ గనుగొనఁ మఱియొక వస్త్రము గాన్పించుచుండెను. ఆమెకోక లక్షయములై మేటులవలెఁ బడుచుండెను. అతఁడిఁక విప్పలేక సిగ్గుపడి దూరముగాఁ దొలఁగి నిలిచెను.

ఇందుకొలువున నిట్టియకృత్యము జరుగుచున్నను దుర్యోధనునివలని భయముననో మఱేకారణముననో సభాసదులలో నొక్కఁడైన నదియన్యాయమని వారింపలేదు. ఒక్కవికర్ణుఁడది ధర్మముకాదని పలికినను వానిమాట నెవ్వరును లెక్కసేయరైరి. అప్పుడు భీమసేనుఁడుమాత్రము కోపముఁబట్టఁజాలక యాగ్రహుఁడై "నాభార్యనిట్లు సభామధ్యమునవమానించినయీ దురాత్ముని గుండెలు బ్రద్దలుచేసి వేఁడినెత్తురుత్రాగి యారక్తసిక్తములగు హస్తములతో నీపెశిరోజములను ముడివైచెద" నని శపథముచేసెను. సభాసదులు కోపమున కడినమయము కాదని వారించిరి. ధర్మబద్ధుఁడగు నాతనిక్రోధము బోనునందుంపఁబడిన సింహపుఁగోపమువలె నిరర్థకమని నిరసనభావముతో దుర్యోధనుఁడునవ్వుచు ద్రౌపదిని దనతొడలపైఁ గూర్చుండుమని సంజ్ఞచేయ నదిచూచి మఱల భీముఁడు ఆతొడల నేవిఱుగఁగొట్టి యాతనిం జంపెదనని మఱియొక ప్రతిజ్ఞవహించెను. జగత్త్రయవిజయ చణభుజవీర్యమేదురులైన సోదరులున్నను పాండుసుతుఁడు ధర్మపాశబద్ధుఁడగుటచే నన్నియవమానములకంటె నెక్కుడగు ధర్మపత్నీపరాభవమును గన్నులారఁ గాంచుచుండియు నేమియుననక ప్రశాంతుఁడై తమ్ములనువిజృంభింపనీయక యూరకుండెను. ఆహా! ఏమియా మహనీయుని ధర్మతత్పరత.

సభాభవనము కౌరవదూషణధ్వానములతో నిండిపోయెను. కురుకులము సమూలముగా నంతరించుసమయము సన్నమైనదని కురువృద్ధగురుబాంధవాదులు తమలోఁదామనుకొనిరి. ఆదూషణవాక్యములనాలకించి యాంబికేయుఁడు దుర్యోధనుని నాతనిప్రియమిత్రులగు కర్ణాదులను బిలిచి గట్టిగాఁజీవాట్లుపెట్టి పాంచాలరాజనందనను పాండునందనులను దగ్గఱరప్పించి ప్రశాంతవచనముల వారిరోషము తొలఁగించి ద్రౌపదికోరిన రెండువరములప్రకారము పాండవులను వారియాయుధములతో దాస్యవిముక్తులనుజేసి విడుచుటయేగాక వారియర్ధరాజ్యముకూడ వారికిచ్చి యెప్పటియట్ల నింద్రప్రస్థపురమున రాజ్యమునేలుకొనుచు సుఖంబుండుఁడని పలికి తన్ను

గాంధారినైనం దలంచి దుర్యోధనాదులొనర్చినదుర్ణయములను మఱచి దయాహృదుఁడని ప్రతిపాలింపెను? యుధిష్ఠిరుని యాసతిచే నందఱును ప్రశాంతచిత్తులై యింద్రప్రస్థమునకుఁ జనిరి.

ఎన్నో ప్రయత్నములుచేసి కష్టించి యెట్లో లాగుకొనిన రాజ్యసంపదలను దండ్రి మరలఁ బాండవుల కకారణముగ నిచ్చి తమవ్యాపారము ధ్వంసముచేసినందులకు దుర్యోధనుఁడు మిగుల విచారించి తండ్రి కడకేగి ప్రార్థించి యొప్పించి మరల జూదమాడ రమ్మని యుధిష్ఠిరునికిం వర్తమానము చేసెను. అతండును నంతకు ముందు జరిగిన పరాభవదుఃఖమును మఱచియో కాంతారవాసాది క్లేశముల ననుభవింపవలసినవిధి యుండుటనో విధి విధానము దుర్లంఘ్యమగుటచేతనో రెండవమాఱు కూడ జూదమాడుటకు హస్తినగరమునకుఁ గుటుంబ సహితముగా నేగెను. కష్టముల ననుభవింపవలసిన కాలమున మంచి యూహాలు కలుగుట యరుదుగదా!

"ననిర్మితో వై నచదృష్టపూర్వో నశ్రూయతే హేమమయః కురంగః। తథాపితృష్ణారఘునందనస్య వినాశకాలే విపరీతబుద్ధిః॥"

ఈమారు జూదమున నోడిపోయినవారు మునుపటివలెగాక వల్కలాజినంబులు ధరియించి వన్యమూలఫలాశనులై బ్రహ్మచర్యంబునఁ బండ్రెండు సంవత్సరము లరణ్యవాసము చేసి పదుమూడవవత్సర మజ్ఞాతవాసము చేయుటయును, నా



యజ్ఞాతవాససమయమున బయలుపడిరేని మరలఁ బండ్రెండేండ్లరణ్యవాసంబును నజ్ఞాతవాస మొక్కసంవత్సరమును జేయుచుండుటకును నియమము చేసికొని యాట మొదలుపెట్టిరి. అప్పుడును ధర్మనందనుఁడే యోడిపోయెను. యుధిష్ఠిరుఁడు సమయప్రకారము రాజ్యము కౌరవులకొప్పగించి సతీసహోదరసంయుతంబుగ విప్రసుహృద్బాంధవు లనుగమించుచుండ భీష్మద్రోణ కృపాచార్య ధృతరాష్ట్రవిదురులకడ సెలవుగైకొని యరణ్యముల కరిగెను. విదురుఁడు పాండవులహితకాంక్షియై వారలకు మేలుగలుగఁ బ్రార్థించి యుధిష్ఠిరుని విడువలేక విడువలేక విడిచెను. విదురునికోరికప్రకారము ధర్మజుఁడు తల్లిని తనయింట నుంచెను. తనకోపదారుణ కటాక్షప్రసారమువలన జనులు దహింపఁబడుదురేమోయని వెఱచుచు ధర్మనందనుం డుత్తరీయాగ్రమున ముఖమును గప్పుకొని తలవంచుకొని క్రమముగా నరణ్యభూముల కేగెను.

దుర్వ్యసనములందుఁ దగుల్కొనువాఁడెంత సప్తద్వీపపరిపాలకుండగు చక్రవర్తియైనను, నెంతటిశాస్త్రజ్ఞానముగల పండితుఁడైనను, దపఃప్రభావసంపన్నుఁడగు మహర్షియైనను దనవిభవముఁ గోల్పోవక తప్పదుగదా! షట్చక్రవర్తులలో ద్వితీయుఁడుగా నెన్నఁబడుచు సప్తాదశద్వీపములను బాలించుచు నిజనామస్మరణమాత్రమున నెల్లవారికలికలుషములను దొలఁగించు శక్తిగల నలచక్రవర్తి జూదమువలననే సకలసం

పదలను గోల్పోయి పదవినివిడిచి యొకసామాన్యరాజన్యుని కడ నధమాధమమగు గుఱ్ఱములను దోలుపనియందుఁ బ్రవేశించి కష్టములననుభవింపలేదా? దుర్వ్యసనాసక్తుఁడగువాఁడు చెడిపోవుననుట కింతకంటె వేఱుదాహరణ మేమి కావలయును?

---

## తొమ్మిదవ ప్రకరణము.

### వనవాసము.

ధర్మస్వరూపులగు యుధిష్ఠిరాదులు దుర్యోధనునిచే నధర్మద్యూతమున విజితులై వనమున నివసింపఁ బోవుచున్నారనువార్త విని పౌరముఖ్యులలోఁ జాలమంది యట్టిదురాత్ముని రాజ్యమునందుండుటకంటెఁ బవిత్రచరిత్రులగు పాండవులతోఁ గాటరణ్యమునఁ గూరగాయలు తినుచునివసించుటయే యుత్తమమని వారితోఁగూడ బయలుదేరిరి. కాని యుధిష్ఠిరుఁడు వారలనందఱను వారించి మహాత్ములారా! మీరు నాతోఁగూడవచ్చి యిడుములనొందుచుండుట చూచి నేను సహింపఁజాలను. పదుమూఁడు వత్సరములును బదుమూఁడు గడియలవలెఁ గడపి మరల వచ్చి రాజ్యపాలనము చేయుదుము. కనుక నాపైఁ గరుణించి మరలుఁడని ప్రార్థించెను. చాల మంది యామహనీయుని యనుజ్ఞ నతిక్రమింపలేక వెనుకకు మరలిరి. గాని కొంతమంది బ్రాహ్మణప్రవరులుమాత్రమెం



తఁ జెప్పినను ధర్మమూర్తియగు నాతని విడువఁజాలక కూడ నేగిరి. పరమవిశ్వాసముతోఁ దనతోవచ్చు ధరణీసురవరులను గాదనఁజాలక యుధిష్ఠిరుఁడు తనతోఁ గొనిపోయెను. అందఱును ద్వైతవనమున విడిసిరి.

పూర్వమిండ్లకడనున్నప్పుడు ఇష్టమృష్టాన్నముల నంతుష్టినొందుచుండు ధరణీదేవతలందఱును దనమీఁది ప్రేమను బురస్కరించుకొని విడువఁజాలక వనమునకువచ్చి యాకలములను దినుచుండుటను యుధిష్ఠిరుఁడుచూచి సహింపఁజాలక రాజాధిరాజయి యింద్రప్రస్థమున నున్నపుడు వేలకొలఁది ద్విజసత్తములకు హిరణ్మయపాత్రముల మృష్టాన్నములనిడు తాను బ్రస్తుతమునఁ దనకనురక్తులైన కొలఁదిమంది బ్రాహ్మణులనైనఁ బోషింపఁ జాలకుండుటకు వగచి ధౌమ్యునుమతిని సూర్యభగవానునిఁ బుష్పోపహారములఁ బూజించి గంగయందు నిలిచి వాయుమాత్రభోజనుఁడై యష్టోత్తరశతనామములఁ బునశ్చరణసహితముగ నుపాసించెను. ఆతనిభక్తికి వనజబాంధవుఁడు మెచ్చి ప్రత్యక్షమయి యరణ్యవాసము పండ్రెండు వత్సరములును నీపాత్రమునఁ జతుర్విధాహారములు నక్షయముగ నుత్పాదిల్లును. నీవుదీని నుపయోగించుచుండుమని దాని నిచ్చి యంతర్హితుఁడయ్యెను.

చ॥ "అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ
బడసి మహీసురోత్తములభవ్యులఁ బల్వుర నుద్ధరించె, న

క్ష్మను ద్రుపదాధిరాజసుత • పాల్పడ వండిన వన్యశాకముల్
గమరుచి నిష్టభోజనసు • ఖంబులఁ దృప్తులఁ జేయుచుండఁగన్

యుధిష్ఠిరుం డిట్లనేకశతసంఖ్యాక మహీసురవరుల నను దినము నభిమతాన్నప్రదానంబునఁ దృప్తినొందించుచుఁ దద్భుక్తశేషమును దానును దమ్ములును ద్రుపదపుత్రికయు నుపయోగించుచుఁ గాలము గడుపుచుండిరి.

పాండవులొకనాఁడు దుఃఖోపశమనంబులైన కథలు చెప్పుకొనుచున్న యవసరమునఁ బ్రసంగవశమున ద్రౌపది యుధిష్ఠిరునితో నిట్లు పలికెను, "మహాశయా! వృద్ధుఁడయ్యును ధృతరాష్ట్రుఁడు కొడుకుపలుకులువిని క్రూరుఁడై దురూహ చేసి మీ రాజ్యములాగుకొని యిప్పటికి స్వస్థచిత్తుఁడయ్యె. ఆదురాత్మునిహృదయ మయఃపాషాణములకంటెఁ గఠినము. విమల సౌధములందుఁ జరించుచు సర్వాసనములనుండి చందనాగరు లిప్తదేహులై సకలసామంతరాజనివహముచే సేవింపఁబడు మీరు వానికతమున నేఁగదా వనమందు దర్భశయ్యలపైఁ బరుండి భూరేణువులు శరీరములు నిండ వన్యమృగములే పరిజనముగా సంచరింపవలసివచ్చినది. ఇట్టి మీయవస్థచూడ నాకు మిగుల దుఃఖముద్భవిల్లుచున్నది. నీయాజ్ఞాశృంఖలముల బంధింపఁబడుటవలన నీయనుజులు సమర్థులయ్యును బరాక్రమము విడిచి బోనులోనుంపఁబడిన సింగపుఁగొదమలవలెఁ జూచుచు నూరకుండవలసినవారైరి. అకటా! పదివేలయేనుఁగుల బలము



గల మనభీమసేనుఁడు చేతఁగానివానివలెఁ గారడవియందు గాయలుకూరలు దినుటయు మహాపరాక్రమశాలియగు నర్జునుఁడిట్లు వ్యర్థుఁడై యేమియుఁ దోఁపక తిరుగుచుండుటయుఁ జూడ నాతలతిరిగిపోవుచున్నది. కేవలము శాంతమువహించుట రాజగువానికిఁ దగదు. ఓర్పును బరాక్రమమును నాయా కాలములందుఁ బ్రయోగింపని రాజునకు బ్రజానురాగ ప్రతాపంబులుండవు. నిత్యక్షమాసహితుండగు రాజును భృత్యులుకూడ నవమానింతురు. అత్యధికతేజంబు చూపువానిని గృహాగతంబైన సర్పంబునుబోలెఁ జూతురు. యథాకాలముల వాని నుపయోగించువాని కుభయలోకసిద్ధి గలుగును. కావున శత్రుకృతతిరస్కారమునకుఁ బ్రతియొనర్చి నీరాజభావంబును వెల్లడింపుము" అని. దానికనుగుణముగా భీమసేనుఁడును గడు రోషముగా మాటలాడి యుధిష్ఠిరుని ధర్మప్రవర్తనము వలన నర్థకామములకేకాక యతనికిని నతనిబంధుజనములకును గూడ బాధగలుగుచున్నదనియు బ్రాహ్మణధర్మములేగాని క్షత్రియోచితధర్మములాతనికడఁ గొంచెముగనైన లేవనియు, నట్లుండుట నీతిసమ్మతము కాదనియు, నాతఁడెంత ధర్మముగా వర్తించినను బదుమూఁడువత్సరముల యనంతరముననైన యుద్ధమొనర్చిననేగాని దుర్యోధనుఁడు రాజ్యము నీయఁడనియుఁ బ్రస్తుతమునఁ బ్రకృతిజనములందఱును ధర్మజుని యెడల ననురక్తులై యున్నారు గనుకఁ దమ కేతప్పక జయము సమకూరును గావున వెంటనే సమయమును ద్రోసిపుచ్చి యుద్ధమా

త్రిప్పి బయలుదేరుటయే యుక్తమనియు బహుభంగుల నిష్ఠురములను హృదయమర్మవిదారణములును నగువాక్యములఁ గుసుమకోమలంబగు యుధిష్ఠిరుని మనమును నొప్పించెను.

ద్రౌపదీభీమసేనులవాక్యములు ములుకులవలె నాతని హృదయమున నాటి నొప్పించెను. అతనిమనస్సు చలించి యేమియుఁదోఁపక విచారపరీతచేతస్కుఁడై యటునిటు తిరుగుచుండెను. పదుమూఁడువత్సరముల యనంతరమునఁ గూడ దుర్యోధనుఁడు రాజ్యమునీయఁడనియు, యుద్ధము చేయక తప్పదనియుఁ, దామైదుగురును నపరిమితసేనలుగల కౌరవులను జయించుట యెట్లనియు, నాలోచించుచు డోలాందోళితమానసుండై యాతఁడుండ దైవవశమునఁ గృష్ణద్వైపాయనుండచటికి వచ్చి యతనివిచారము నెఱింగి యోదార్చి తనయొద్దనున్న ప్రతిస్మృతియను విద్య నాతనికుపదేశించి దానినర్జునునకుపదేశించి యాతనిచే దేవతల నారాధింపించినయెడల దివ్యాస్త్రలాభము గలుగుననియు నప్పుడుమీరు సూక్ష్మముగా శత్రువులను జయింపఁగలరనియుఁ జెప్పి తనయాశ్రమమునకుఁజనెను.

యుధిష్ఠిరుని యుపదేశమున నర్జునుఁడింద్రకీలపర్వతమునకరిగి యచట భక్తవత్సలుండగు మహాదేవునిఁగూర్చి తపం బొనరించెను. శంకరుండాతని తపమునకు మెచ్చి నిజరూపమునఁ బ్రసన్నుఁడుగాక మాయాకిరాతరూపమునఁ బ్రత్యక్షమై యర్జునునితో లేనిపోనివివాదము గల్పించుకొని యాతని బాహు



బలసారము నెఱింగి పిదప నిజరూపమున సాక్షాత్కరించి యాతని యస్త్రవిద్యాకౌశలమును గొనియాడి పాశుపతంబను నస్త్రరాజము నొసంగి యంతర్హితుండయ్యెను. పిదప నర్జునుఁడింద్రుని కోరికపై మహాపరాక్రమవంతులగు నివాతకవచులను గాలకేయాదులను సంహరించి మహాకీర్తి సంపాదించి యన్నకడకు వచ్చెను. దివ్యాస్త్రలాభము నంది వచ్చిన యర్జునునిఁ గౌఁగిలించుకొని యుధిష్ఠిరుఁడు మిగుల సంతసించెను.

వనవాససమయమున యుధిష్ఠిరునికడ కఖండ తపోగరిష్ఠులగు మునిశ్రేష్ఠులనేకులు వచ్చి పురాతనరాజర్షిచరిత్రములు వర్ణించిచెప్పి మిగులసంతసముగలిగించిరి. అందు బృహదశ్వుండను మునిసత్తముఁడు నిషధనేలినలుని పుణ్యచరిత్రమును వర్ణించిచెప్పెను. లోమశుండనుమహర్షి యగస్త్యఋశ్యశృంగపరశురాములయొక్కయు శిబిసోమకాదులయొక్కయుఁ జరిత్రములను వేర్వేఱ నెఱిఁగించి సంతసింపఁజేసెను. మార్కండేయమహర్షి రాజచంద్రులగు హరిశ్చంద్రరామచంద్రుల చరిత్రములు సావిత్ర్యుపాఖ్యానమును దెలిపెను. మఱికొందఱిత [illegible]లితరధర్మము లనేకములాతనికి బోధించిరి. పుణ్యకథాశ్రవణంబున యుధిష్ఠిరుం డత్యంతకుతూహలియై వారలవలె దానునుమును మున్ను గొన్నికష్టములననుభవించినను దుద కఖండరాజ్యలక్ష్మీవిలాసంబుల ననుభవింపఁగలుగుదునుగదాయని యభినవోత్సాహపూరితుండై యుండెను.

---

# పదవ ప్రకరణము.

## శరణాగత రక్షణము.

సుకుమారులగు పాండురాజకుమారులును నాగర్భశ్రీమంతురాలయిన పాంచాలి రాజతనూజయు నారవస్త్రము లధరించి కందమూలఫలాశనులై పర్ణకుటీరముల నివసించుచు నదీజలములఁ ద్రావుచు వన్యమృగసంతతులె తమకు సహాయంబుగా నట్టడవుల ననరాని బాధలు పడుచుండ దురాత్ముండగు దుర్యోధనుఁడు వనవాసాయాసఖిన్నులగు వారలకుఁ దనయైశ్వర్యవిభవములనుజూపి వారిని బరాభవింపవలయుననియు వెనుక సభయందుఁ దనభంగపాటునుజూచి నవ్విన ద్రౌపది నొక్కమాఱు పరిహసించి యామె విచారమునుగాంచి సంతసింపవలయు ననియు నెంచెను. అతఁడు తనయాలోచనను వెంటనే మిత్రుల కెఱిఁగించి యాలోచించి ద్వైతవనమునందున్న తమపశువులకు దుష్టమృగములవలనఁ గలుగుబాధలు తొలఁగింపనేగుచున్నానను నెపమునఁ గతిపయపరిజనములతోఁ గర్ణాదిమిత్రవర్గమువారును దుశ్శాసనాదిసహోదరులును శుద్ధాంతకాంతలును వెంటరా ద్వైతవనమునఁ బాండవులున్నచోటికి సమీపమందలి యొక కాసారతీరమున విడియుటకై క్రీడాగారముల నిర్మింపుఁడని నిజపరిజనుల కాజ్ఞాపించెను. ప్రభువు వానతిప్రకారము వారట్లు ప్రయత్నించుచుండ నంతకుఁ బూర్వమె చటఁ గావలియున్న గంధర్వులువచ్చి యాకొలను చిత్రసేనుఁడనుగంధ



ర్వరాజునకుఁ గ్రీడార్థము నిర్మింపఁబడినది గనుక మీరిచ్చటికి జేరక దూరముగాబొండని నివారించిరి. వారు మరలివచ్చి దుర్యోధనున కావృత్తాంతము నెఱిఁగింప నాతఁడు కోపించి దుర్మదుడైనతనసైనికులను గంధర్వులను దరిమివచ్చుటకుఁ బురికొల్పెను. గంధర్వులకును సుయోధనుని సైనికులకును గ్రమముగాఁ గలహమారంభమై తుదకు ఘోరసంగ్రామముగాఁ బరిణమించెను. మహావీరులగు కర్ణాదులుకూడ గంధర్వులధాటికిఁ దాళఁజాలక పాఱిపోయిరి. గంధర్వపతియగు చిత్రసేనుఁడు దుర్యోధనుని గాలుసేతులుకట్టి తనరథముపైనుంచుకొని యంతరిక్షమున కెగసెను. అంతఃపురాంగనలు గంధర్వులచేఁ జెఱ పట్టఁబడిరి.

దుర్యోధనుని పరిజనులలోఁ గొందఱపుడు చేయునది లేక మహోదారుఁడగు యుధిష్ఠిరునికడకుఁబోయి తమరాజునకుఁగలిగిన పరాభవము విన్నవించి యాతనిఁగాపాడుమని వేడుకొనిరి. ప్రక్కనేయున్న భీముఁడు దుర్యోధనుని ప్రస్తుతావస్థకు మిగుల సంతోషించి మనము ముందెప్పుడో చేయఁదగినపని యిపుడు గంధర్వులేచేసిరి. అప్రయత్నముగను ననాయాసముగను మనకు జయము సమకూరెను. కల్లరయై యెల్ల పాపకృత్యములకును కారణుఁడైన యాతఁడు మనల నవలాపింపవచ్చి దానిఫలము తానేయనుభవించెను.

మ॥ "విపరీతస్థితినొంది ఘోరవిపినో ♦ ర్వీవాసులై నిత్యముః

ఖచరాధీశుతఁ దూలిరంచు మనలన్ ♦ గర్వోద్ధత స్వాంతుఁడై
యుపలాపింపఁగవచ్చి దుర్ణయపరుండై ధార్తరాష్ట్రుండు వి
పరీతాత్ముఁడు తత్ఫలంబు గుడిచెన్ ♦ సత్యంబు సామాత్యుఁడై"

కావున వానియెడలఁ గరుణచూపవలదని ఖండితముగాఁ బలికెను. దానికి గరుణాగరిష్ఠుండగు పాండవజ్యేష్ఠుండు "భీమసేనా! ఇది పరుషవాక్యములకుఁ దగుసమయమా? శత్రుపరాభూతులై మనలను శరణుజొచ్చిన సహోదరులకు సహాయము చేయకుండుట మనకు ధర్మమా? ఒక్కవంశమునందు జనియించినవారికి దాయభాగములవిషయమై యొక్కొక్కమాఱభిప్రాయభేదముగలిగినను లఘుబుద్ధులై సహజమగు ప్రేమను వీడుట న్యాయమా? జ్ఞాతులు తమలోఁ దమకెట్టివివాదములున్నను నితరులవలనఁ బరాభవము సంభవించినపుడొండొరులకు సహాయము చేసికొనకుండుట లోకనింద్యము కాదా? దుర్వినీతుండైనను దుర్యోధనుఁడు సభార్యుఁడై పరులచేఁబట్టువడినపుడుపేక్షించుట మనకులమునకు హానిచేయుట కాదా? ఇంతేకాక శరణాగతరక్షణము రాజపుత్రులకెల్ల ముఖ్యధర్మమైయుండ నీవంటి బాహుబలసంపన్నులగు తమ్ములుగల నాకుముఖ్యకర్తవ్యమని వేఱుగఁ జెప్పవలయునా? అతనిపూర్వదోషములను మనమిపుడెంచరాదు.

కావరయ్య యనినఁ గరముదుర్బలుఁడైనఁ
జెనసి రోషినంత చేయుమనిన



నూరకుండునయ్య యుత్తముఁడగువాఁడు
దీనజనుల యున్న తెఱఁగు చూచి."

"శరణంబనివచ్చిన భీ
కరశత్రువునైనఁ బ్రీతిఁ గావఁగవలయున్
కరుణాపరుల తెఱంగిది
యిరవుగ నరిగావు దీనికే ధర్మంబుల్"

దుర్యోధనుండు మీబలపరాక్రమంబు లెఱిఁగి యున్నవాఁడు గనుకఁ దప్పక తన్ను విడిపింతురని మనపై నాశపెట్టుకొనియుండును. ఇప్పుడు మనమాతని రక్షించిన నధికంబగు పుణ్యమును గొప్పకీర్తియు మనకు సంభవించును. అపకారియగు నాతఁడు మనవలననిట్టి యుపకారమును బొందినపుడు ఆతని మనస్సుకూడఁ బరిపక్వమగును. కావున మీరు వేగముగా నేగి గంధర్వులను బ్రియపూర్వకముగా ననునయించి సుయోధనుని విడిపింపుఁడు. అట్లుసాధ్యముకానియెడలఁ బరాక్రమము చూపియైన వారలనుగెల్చి కార్యము తీర్చుకొనిరండు." అని ప్రోత్సహించి పంపెను.

అపుడు భీమార్జునులు గదాగాండీవములను ధరించి గంధర్వులమీఁదికిఁజని వారితో ఘోరముగఁబోరి దుర్యోధనాదులను విడిపించి యుధిష్ఠిరునికడకుఁ దీసికొనివచ్చి నిలువఁబెట్టిరి. అతఁడు సుయోధనుని బంధములను విడిపించి మిగులనాదరించి యాతనిదైన్యము తొలఁగునట్లు ప్రియవాక్యముల సంతుష్టిఁగలి

గించి యాదినమున దనయింటికడ మృష్టాన్నములనిడి సంతుష్టునొనర్చి యిష్టాగోష్ఠిని మాటలాడుచు

ఉ॥ "ఎన్నఁడు నిట్టిసాహసము • లింక నొనర్పకుమయ్య సుర్జనుం
డన్నను సాహసక్రియల • యందుఁ గడంగి నశించుఁగావునన్
గ్రన్నన తమ్ములందొరలఁ • గైకొనియిమ్ములఁబొమ్ము వీటికిన్
సన్నుతదీనికొండొక వి•చారము బొందకుమీమనంబునన్"

అని బుద్ధులుసెప్పి వీడుకొల్పెను. ఆహా! యుధిష్ఠిరునివంటి ధర్మశీలుఁడును మహోదారస్వభావుఁడును శరణాగతవత్సలుఁడును మఱియొకఁడుండునా? ఒకరునొకరు చంపుకొనునంతటి మహాక్రోధములు మనస్సులలో నున్నప్పుడుకూడఁ దప్పించుకొనక వెనుకటినేరములు తలంపక సమయముచిక్కెనుగదా యని దెప్పక యాజన్మశత్రువును మహాదుర్మార్గుండును నగు దుర్యోధనునకట్టి మహాపదయందడ్డుపడి ప్రాణసంరక్షణ మహోపకారముచేయుట మహామహుండగు యుధిష్ఠిరమహారాజునకే తగును.



## పదునొకండవ ప్రకరణము.



### విజ్ఞానసంపద.

భీమసేనుఁ డొకనాఁ డరణ్యమునకు వేఁటకుఁబోయి చాలరాత్రియైనను నింటికి రాకపోయెను. ద్రౌపది యందులకు భయపడి ధర్మజునితోఁ జెప్పి యాతనిని వెదికింపుమని ప్రార్థించెను. అతఁడనుజుని వెదకి వెదకి యగపడకపోవుటవలనఁ తుదకొక కొండగుహలోనికిఁ బోయెను. అచట భీముఁడు కొండచిలువచేఁ జుట్టుకొనఁబడి కదలమెదలఁజాలక పడియుండెను. యుధిష్ఠిరుఁడు భీముఁడు చనిపోయెనేమోయని చాలవిచారించెను. కాని భీమసేనుఁడాతని యాక్రందనము విని "అన్నా? నేనింకను ప్రాణములను గోల్పోవలేను. నన్ను వేగముగ విడిపింపుము. ఇఁక నాలసించినచోఁ బ్రాణములు నిలువవు" అని దీనముగ బ్రతిమాలెను. ధర్మజుఁడు తనయనుజుని విడువుమని యజగరమును బ్రార్థించెను. నేనడిగిన ప్రశ్నములకు బదులుచెప్పెదవేని నీతమ్ముని వదలెదనని సర్పరాజము పలికెను. యుధిష్ఠిరుఁడంగీకరించెను. వారిరువురకును నీక్రిందివిధముగా సంభాషణముజరిగెను.

అజ—ఎట్టిగుణములు గలవాఁడు బ్రాహ్మణుఁడు?

యుధి—సత్యము, ఓర్మి, దమము, శౌచము, దయ తపస్సు, దానము వీనినవలంబించువాఁడు బ్రాహ్మణుఁడు.

"ఆతఁడెఱుఁగఁ దగిన విషయమేమి ?

"సుఖదుఃఖములందు విమోహము నొందకుండుటయే యాతఁడెఱుఁగఁదగినది"

"ఇట్టివి శూద్రునందుఁగలిగిన వాఁడుత్తమద్విజుఁడగునా?"

"కానేరఁడు. అపుడాతఁడు సచ్ఛూద్రుఁడనఁబడును.

బ్రాహ్మణునందివి లేనిచో నతఁడు మాత్రము శూద్రుఁడనఁ బడును"

"పరాకుకాలములోనచ్చినను నసత్యములాడినను హింసమాత్రము కావించనిమనుజున కెట్టిగతి ప్రాప్తించును?"

"దానము, ప్రియము సేయుట, సత్యము, అహింసయును నీనాలుగుధర్మములును సమానములే. అయినను వానిలోన హింసయే యుత్తమమని చెప్పవచ్చును. ఏలయన; దేవమనుష్యతిర్యగ్జాతులు మూఁటిలో మనుష్యుఁడు దానాదిగుణములుగలిగి యహింసాపరుఁడైనయెడల దేవత్వము నొందును. దానాదిగుణములున్నను హింసయొనర్చినఁ దిర్యగ్జాతియందుద్భవించును. కావున నహింసయే యుత్తమధర్మము."

యుధిష్ఠిరుండొసఁగిన సరియైన ప్రత్యుత్తరముల కా యజగరము మిగుల సంతోషించి భీముని విడిచి శాపవిముక్తి నొంది తనపూర్వరూపముతో "ధర్మజా! నేను నహుషుఁడను. అగస్త్యమహర్షి శాపమున నిట్లయితిని. నీవలన నాకుత్తమజ్ఞానముగలిగి శాపవిముక్తుఁడనైతిని. నీకుశుభము గలుగుఁగాక" యని యాశీర్వదించి యమరలోకమునకుఁబోయెను.

యుధిష్ఠిరుని విజ్ఞానసంపద నెఱుఁగుట కింకొక సందర్భముగలదు. అతఁడొకనాఁడు సుఖాసీనుఁడై యున్నసమయమున నొకబ్రాహ్మణుఁడువచ్చి తనయరణి నొకవృక్షశాఖకుఁ దగుల్పఁగా నది యొకమృగము కొమ్ములలోఁ జిక్కుకొన నా



మృగము దానితోఁ బఱువెత్తెననియుఁ దన నిత్యకృత్యములకు లోపము రాకుండ దానినట్లుయుపసాధించి తెప్పించియిమ్మని యుఁ బ్రార్థించెను. వెంటనే యాతఁడు సోదరసమేతముగా ధనుర్బాణములనుధరించి యాబ్రాహ్మణునితోఁగూడ బయలు దేఱెను. అదివారలను బహుదూరమాయాసపఱచి తీసికొనిపోయి యదృశ్యమయ్యెను. తమయత్నము విఫలమగుటను విషాదమునొందుచు వారలసియుండుటచే శీతలచ్ఛాయమగు నొకవటమహీరుహము క్రిందవిశ్రమించిరి.

యుధిష్ఠిరుఁడు నకులునిఁజూచి యనుజా! మనసోదరులు మిగులదప్పిఁగొనియున్నారు. నీవీవృక్షము నెక్కి చుట్టుప్రక్కల జలాశయమేదైన నున్నదేమో కనుఁగొనుమనియెను. అతఁడును వెంటనే యావిటపమునధిరోహించి నలుదెసలుకలయఁబరికించి దూరంబుననొకకొలనున్నదని యన్నకెఱిఁగించి జలములుగొనిరా నతనిచే నాజ్ఞప్తుఁడైత్వరితముగా బయలుదేఱిపోయి తుద కొకతటాకమునుగని జలములుద్రావంబోయెను. ఇంతలో నీకీజలము త్రాగవలెనను కోరిక యున్నయెడల ముందు నాప్రశ్నములకుఁ దగినయుత్తరము నీయవలయును. అనునొక యశరీరవాక్కు తనికిఁగర్ణగోచరంబయ్యెను. కాని యామాట వాతఁడు లక్ష్యపెట్టక తటాకములో దిగినీరు త్రావి మూర్ఛిల్లెను.

నకులుని యాలస్యమునకు వగచి యుధిష్ఠిరుఁడు సహదేవునిఁబోయి చూచి రమ్మన నాతఁడును నేగి పడియున్న

నకులునిఁ గని విచారించి దాహమునకుఁ దాళఁజాలక తనకును వినఁబడిన యాకాశవాక్యమునం దనాదరము చూపి జలము గ్రోలి మూర్ఛిల్లెను, క్రమముగా నర్జునుఁడును భీముఁడును నట్లే యైరి. తమ్ములు నలువురు నంతకాలమాలస్యము చేయుటవలన వారికేమి కీడు మూడెనోయను విచారముతో యుధిష్ఠిరుఁడు తానును బయలుదేఱిచని తటాకపుటొడ్డునఁ బడియున్న తమ్ములు నలువురను జూచి మిగుల దుఃఖించి తుదకు దప్పిక కోర్వక జలపానమునకై సరోవరములోనికి దిగెను. వెంటనే మొదటవలెనే యశరీరంబగు వాక్కు శ్రవణపథంబునఁ బడెను, వెంటనే యాతఁడు నిలిచి పరికించి యది యొకబకము ముఖమునుండి వచ్చిన ధ్వనిగా నెఱింగి నమస్కరించిదాని వృత్తాంతము నాబకము నడిగెను. వెంటనే యాబకము ఘోర రూపముగల యొక యక్షుఁడుగా మాఱి యుధిష్ఠిరు నెదుట నిలిచి రాజా! నాయనుమతి లేక యెవ్వరయినను దీని నీరు త్రావినఁ జత్తురు. నీవు బుద్ధిమంతుఁడవు గావునఁ ద్వరపడలేదు. మదీయ ప్రశ్నముల కుత్తరంబొసఁగి దాహముతీర్చుకొనుము. అనెను. దానికి ధర్మజుఁడు మహాత్మా! నీమనమునకు వచ్చునట్లు చెప్పుట కల్పబుద్ధినగు నాకు శక్యమగునా? అయినను నానేర్చిన విధమున నుత్తరంబిచ్చెదననెను. వారల కీక్రిందివిధముగఁ బ్రశ్నోత్తర రూపకమగు సంభాషణము జరిగెను.

"సూర్యుని నడపునదేది?"
"బ్రహ్మము."



"సూర్యుని సేవించుచుఁ దిరుగు వారెవరు?"
"సురలు"
"అతఁడు దేనిచే నస్తమించును?"
"ధర్మునివలన."
"అతని కాధారమేది?"
"సత్యము."
"మనుజుఁడు దేనివలన శ్రోత్రియుఁడనఁబడును?"
"శ్రుతమువలన."
"దేనివలన మహిమ నొందును?"
"తపస్సువలన."
"వానికేది సహాయ పడునది?"
"ధైర్యము."
"దేనివలన బుద్ధిమంతుఁడగును?"
"బుధులను సేవించుచుండుటవలన."
"భూదేవుఁడు దేవత్వమెట్లు పొందును?"
"అధ్యయనమువలన."
"అతనికి సాధుత్వాసాధుత్వము లెట్లు కలుగును?"
"నిరంతర వ్రతాచరణమువలన సాదుత్వమును శిష్టాచారములనుండి తొలఁగుటవలన నసాధుత్వమును గలుగును."
"అతఁడు మానుషుం డెట్లయ్యెను?"
"మృత్యుభయముండుటవలన."
"ఎట్టివాఁడు జీవన్మృతుఁడు?"

"దేవాతిథి పితృభృత్యజనులకుఁ బెట్టక యొంటిగాఁ దినువాఁడు."

"భూమికంటె గౌరవము గలదేది?"

"జనని."

"ఆకసమునకంటెఁ బొడవైన వస్తువేది?"

"జనకుఁడు."

"గాలికంటె వేగముగలదేది?"

"మనస్సు."

"తృణముకంటె దట్టమైనదేది?"

"చింత."

"నిద్రించినను గన్నుమూయనిదేది?"

"మీనము."

"పుట్టినను బ్రాణములేనిదేది."

"గుడ్డు."

"రూపమున్నను హృదయములేనిదేది?"

"పాషాణము."

"వేగముతో నుండునదేది?"

"ఏఱు."

"తెఱువు నడుచువానికి, రోగార్తునకు, గృహస్థునకు, మృతినొందినవానికిఁ జుట్టములెవ్వరు?"

"క్రమముగా సార్థము (వర్తకులబిడారు) వైద్యుఁడు,



మంచిభార్య తానొనర్చుకొనిన ధర్మమును జుట్టములు."

"ధర్మమున కాధారమేది?"

"దాక్షిణ్యము."

"కీర్తికాశ్రయమేది?"

"దానము."

"సురలోకమునకు మార్గమేది?"

"సత్యము."

"సుఖముల కాధారమేది?"

"శీలము."

"నరునకాత్మయేది?"

"కుమారుఁడు."

"అతనికి దైవికమైనచుట్ట మెవ్వరు?"

"భార్య."

"అతని జీవనమున కాధారమేది?"

"మేఘము."

"దేనివలన నాతఁడు సంతసించును?"

"దానమువలన."

"ఉత్తమధర్మమేది?"

"అహింస."

"ఎల్లప్పుడును దృప్తిగాఁ బండియుండునదేది?"

"యాగకర్మ."

"దేని నిగ్రహమున సంతోషముగలుగును?"

"మనస్సు క్రొవ్వుతొలగించుటవలన."

"ఎవరితోఁ జేసిన సంధివిడదు?"

"సుజనులతో."

"లోకమున కేదిదిక్కు?"

"సజ్జనులు."

"అన్నోదకములు దేని యందుద్భవించును?"

"భూమ్యాకాశములయందు."

"విష మేది?"

"బ్రాహ్మణధనము."

"శ్రాద్ధవిధికి సమయమేది?"

"బ్రాహ్మణాగమన కాలము."

"మనుజుఁడు దేనిని విడిచి సర్వజనప్రియుఁడు, శోకములేనివాఁడు, ధనవంతుఁడు, సుఖవంతుఁడు నగును?"

"క్రమముగా గర్వమును, క్రోధమును, లోభమును, తృష్ణను వర్జించినయెడల."

"ఎట్టివాఁడు పురుషశబ్దవాచ్యుఁడు?"

"కీర్తిమంతుఁడు."

"సర్వధని యనఁదగువాఁడెవ్వఁడు?"

"ప్రియాప్రియములు, సుఖదుఃఖములు, సమానముగా నెంచువాఁడు."



తన ప్రశ్నముల కన్నిటికిని యుక్తములగు సమాధానముల నిచ్చిన యుధిష్ఠిరుని ప్రజ్ఞావిశేషమునకు యక్షుఁడు సంతసించి దయావలోకనముల నాతనిపైఁ బఱపి "మహాత్మా! నీయుత్తరములవలన సంతుష్టుండనైతిని. నీతమ్ములలో నొక్కని ప్రాణమిచ్చెద వేఁడు"మనెను.

య—"మహానుభావా! నకులుని బ్రదికించి నన్ననుగ్రహింపుము."

య—"నిరుపమాన బలపరాక్రమశాలులగు భీమార్జునులుండ వీనిని గోరుటయేల?"

య—"యక్షవరా! మాతల్లిపుత్రులు ముగ్గురిలో నేను బ్రదికి యున్నాను. మాపినతల్లియగు మాద్రితనయులం దొక్కరుండుండిన నుభయులసంతతి యున్నదగును. అదియే ధర్మము. అట్లనుగ్రహింపుము."

ధర్మజుని ధర్మబుద్ధికి నాతఁడు మిగుల సంతుష్టుఁడై యాతని నలుగురు తమ్ములను బ్రదికించి నిజరూపము ధరించి తనయా! నేను యముఁడను. ధర్మమూర్తివగు నిన్నుఁ జూచుటకే వచ్చితిని. నీవిజ్ఞానసంపద సంస్తవనీయము. నీవింకొక్కవరము. కోరుకొమ్మనెను. దానికి ధర్మనందనుఁ డానందించి బ్రాహ్మణుని యరణిదొరుకునట్లు చేయుమని కోరెను. ఆతఁడు దానిని మృగరూపమున నపహరించినది తానే యని చెప్పి దాని నిచ్చి యజ్ఞాతవాసనమయమున వారు ఇతరులు పసిసుండ

వరమొసంగి మఱియొకవరమును గోరుకొమ్మనెను, దానిపై యుధిష్ఠిరుఁడు.

"ఆదిదేవుఁడవైన నీవు దయామతిం జూడసూపి న
న్నాదరించుటఁ జేసి ధన్యుఁడనైతి నింతకు నెక్కుడౌం
జేది గల్గెడు నైన నామది యెల్లవాఁడును గ్రోధమో
హాదులం బెడం బాసి ధర్మపునందు నెక్కొనఁ జేయవే.

అని వినశ్వరంబులగు రాజ్యలాభాదులను గోరక స్థిరమై యశస్కరమగు ధర్మప్రవర్తననే కోరెను. ఆహా! ఏమి యా మహనీయుని యైహికసుఖవిముఖత.

---

## పండ్రెండవ ప్రకరణము.

---

### అజ్ఞాతవాసము.

అరణ్యవాసము నొనర్చుసమయమునఁ బాండవుల కనేకములగు కష్టములు సంభవించినను గొన్ని లాభములు గూడఁ గలిగెను. యుధిష్ఠిరున కచటనుండునపుడే యనేకమహర్షులసందర్శనము లభించెను. అతఁడు వారివలన నానాధర్మములను వినుట తటస్థించెను. అనేక పురాణేతిహాసములు తెలిసికొనం గలిగెను. దేవతల సాక్షాత్కారమునంది వరములు సంపాదింపవీలు పడెను. ఎట్టెటో వనవాసపు గడువుపూర్తియయ్యెను.



యుధిష్ఠిరుండంతకుముందు సకలకష్టముల కోర్చియగ్నిహోత్రములను గూడఁ దీసికొని తమవెంటనడవులకు వచ్చి పడరానిపాట్లు పడుచున్న భూసురోత్తములను విడువఁజాలకయు విడిచిననే గాని యజ్ఞాతవాస మొనర్చుటకు వీలు లేకయుఁ గడుచింతించి వారినందఱనుఁ జేరఁబిలిచి "మహాశయులారా! మీయందఱి యనుగ్రహమునను నరణ్యవాసకాలము పూర్తియయ్యెను. అజ్ఞాతవాసము చేయవలయు కాలమరుగుదెంచెను. ఈసమయమున మమ్మునెట్లయిన బయలుపఱచి మరలఁ గష్టములపాలుసేయుటకే దుర్యోధనాదులు యత్నించుచుందురు. మీరందఱును మాతోఁగూడ నున్నయెడల వారు మమ్ముల గుఱుతించుట కడుసులభము కావునఁగరుణించి మీమీగృహములకేగి సుఖముగా నుండుఁడు. ఈసంవత్సరము నెట్లో పూర్తిచేసికొని యలఁతికాలముననే మీసందర్శనమునకు వత్తుము" అని విన్నవించి యతిప్రయత్నముచే వారిని బంపెను. ధౌమ్యునిఁ దమ యగ్నిహోత్రములను సంరక్షించుచుండునట్లు ప్రార్థించెను. వంటవారిని బాంచాలీపరిచారికలను ద్రుపదుని పురమునకును, రథసారథులను నింద్రసేనాదులను ద్వారకానగరమునకును బంపివైచెను.

అందఱును జనినయనంతరమున ధర్మరాజనుజన్ములతోఁ దమ యజ్ఞాతవాసమునుగూర్చి ముచ్చటించుచు "నందులకు మత్స్యదేశ మనుకూలముగా నున్నది. నేను బ్రాహ్మణవ

సన్యాసిరూపమును గైకొని కంకభట్టను నామముతో విరాటుని సభయందుఁ జేరి యాతనికి సమయానుకూలములగు పుణ్యకథల నెఱింగించుచు శ్రౌతస్మార్తనిమిత్తజ్యోతిశ్శాస్త్రముల ననుసరించి తగిన యాలోచనలు చెప్పుచు నప్పుడప్పుడుబుసపోఁకకు ద్యూతమాడి యతనికి వినోదమును గల్పించుచు నుందును. ఆతఁడు నాపూర్వచరిత్రము నడిగినయెడల ధర్మరాజుని సఖుఁడనని పలికెదను. మీరెట్లు వర్తింతురని ప్రశ్నించెను. భీముఁడు వలలుఁడను పేరితో వంటవాఁడుగను, నర్జునుఁడు బృహన్నల యనునామమున నంతఃపురకన్యకలకు నృత్యము నేర్పువాఁడుగను, నకులుఁడు దామగ్రంథియను నామాఖ్యతో గుఱ్ఱములకాపరిగను, సహదేవుఁడు తంత్రీపాలుఁడను నభిఖ్యతోఁ బసులకాపరిగను, పాంచాలి మాలినియనునభిధానంబున సైరంధ్రిగను నుందుమని చెప్పిరి. వారి యూహల నాతఁడు సంతోషపూర్వకముగ నంగీకరించెను.

పిదపఁ గతిపయప్రయాణముల వారు విరాటునగరమును సమీపించిరి. ధర్మజుఁడు తమ యందఱ యాయుధములను గట్టగాఁ గట్టి చచ్చినపసరము చర్మము దానికిఁ జుట్టించి నలువలంకులు పరికించి యానగరమున కుత్తరభాగమున శ్మశానవాటికకు సమీపమున మిగుల నున్నతమును విశాలమునై గుబురుగానల్లుకొని పట్టపగలె చీఁకటి కలిగించుచుఁ బిశాచములకు నివాసమువలె భయంకరమై యున్నయొక పెద్దజ



మ్మిచెట్టును జూచియది తగినచోటని నిశ్చయించి యెక్కి దానిపై కొమ్మలలో నాయుధముల కట్టను వ్రేలాడఁగట్టి దానినింకను భయంకరముగఁ జేయుందలంచి యచటియొక శవమును దానికంటఁగట్టి దిగివచ్చి యావనస్పతికిఁ బ్రదక్షిణనమస్కారము లాచరించి యితరులకుఁ దమ యాయుధములు గోచరములు గాకుండ రక్షింపుమని వేఁడుకొనెను. పిదప నందఱు నాసమీపమునఁ గలనదికేగి శుచిస్నాతులై దేవపితృతర్పణాదుల నాచరించిరి,

యుధిష్ఠిరుం డపుడు నియమముతోఁ బ్రాఙ్ముఖుండై నిలిచి నిర్మలమనంబునఁ దండ్రియగు ధర్మదేవతం దలంచుకొని "తండ్రీ! మేమజ్ఞాతవాసము నిర్విఘ్నముగాఁ జేయఁగలుగునట్లు పూర్వమే యిచ్చిన వరము ప్రకారము మాయందనుగ్రహముంచి మేము కష్టములపాలు గాకుండ ననుగ్రహింపుము,, అని మన్ననన్నోఁప విన్నవించి కరకమలంబులు ముకుళించి ఫాలంబునం జేర్చి వినయావనమితమస్తకుండై ప్రార్థించుచుండ శమనునియనుగ్రహంబునఁ జూచుచుండఁగనే యాతఁడు కాషాయవస్త్రములు దండకమండలములు ధరించిన సన్యాసిగా మాఱిపోయెను. మిగిలిన వారు మాఱువేషములు ధరించుటకుఁ దగిన యుపకరణములన్నియు నచట సిద్ధపడెను. ఆయద్భుతమును జూచి యుధిష్ఠిరుఁడు పరమానందమునొంది మీమీ వేషములు ధరించి వేఱుగాఁగండని తమ్ములకు నియ

మించి ముందుగాను విరటుని కొలువుకూటమునకు బయలు
దేఱెను.

ఆనాఁడు విరాటమహారాజు దైవవశమునఁ దన గృహ బహిరంగణమునఁ గొలువుతీర్చి యుండెను. యుధిష్ఠిరుఁడు సన్యాసివేషమున నచటికి వచ్చుచుండ నాతఁడు దూరమునుండియే యాతని దివ్యతేజమును జూచి వెఱఁగుపడి యట్టిరారాజులచే నమస్కరింపఁబడఁదగిన యోగ్యతగల యాతఁడెందులకు సన్న్యసించెనో గదా యని విచారపడి యాతఁడు తన్నేమియు డిగినను నిచ్చుటకు నిశ్చయించుకొని సపరివారముగాఁ బ్రత్యుత్థానముచేసి నమస్కరించి యాశీర్వాదములను బడసి సగౌరవముగాఁ దోడ్కొని వచ్చి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి "మహానీయా! తమనివాసమేది ? ఏకులమువారలు ? ఈదీనునికడ కేమిపనికై విజయము చేసితిరి? దయతో సెలవిం"డని ప్రార్థించెను. "రాజా ! నేను ద్విజుఁడను. కురుదేశమువాఁడను. యుధిష్ఠిరునకు మిత్త్రుఁడను. సన్యాసాశ్రమస్వీకారమొనర్చితిని. ద్యూతము నాడుటయందుఁ గొంచెము నేర్పుగలదు. నాభంగముకోరు కొందఱు జనులు కపటపుజూదమున నాధనమెల్లఁ గెలిచికొని యవమానింప విరక్తుఁడనై యిట్లు బయలువెడలితిని. రాజనీతి కొంచెమెఱుంగుదును. పెద్దలసేవ యొనర్చి కొన్ని ధర్మములు తెలిసికొంటిని. కంకుఁడని నన్నందఱును బిలుతురు. సామాన్యరాజులను గొలువనిచ్చపడక నీవు సాధు



జనరక్షకుఁడవని విని యొకసంవత్సరము జరుపవలసిన వ్రతముండుటవలన హవిష్యమాత్రము భుజించుచు నదియిచట నుండి తీర్చుకొని పిదప నన్ను వంచించిన వారిని జయింపఁబోవలయునని తలంచుచున్నాను. నీకంగీకారమేని యిచట నుండెద"నని యుధిష్ఠిరుఁడు పలికెను. విరాటరాజు దానికి మిగుల సంతసించి "మహాశయా ! ఈదేహము, ఈరాజ్యము మున్నగునవన్నియు మీవిగానే తలంచి మీరాయిచ్చవచ్చినట్లిచట మసలవచ్చినన్ని దినములుండవచ్చును. మీబోఁటివారిసేవ లంభించుట మాయదృష్టవశమునఁ గాదా? అని యంగీకరించి నాఁటినుండియు నాతని బహుగౌరవముగాఁ జూచుచుండెను. భీమాదులును దమతమ యేర్పాటు ప్రకార మారాజుకొలువునఁ జేరి కాలముగడపుచుండిరి.

అచట దుర్యోధనుడు పాండుకుమారులు వనవాసము చేయు పండ్రెండు సంవత్సరములును దానే భూమండలమంతయు నేకచ్ఛత్రముగ నిస్సపత్నముగఁ బరిపాలించియుఁ దనివితీరక పదుమూఁడవ వత్సరమునఁ బాండవు లేదేశమున నజ్ఞాతవాసము చేయుచున్నారో తెలిసికొని వారలను బయలుపఱచి మొదటఁజేసికొనిన సమయము ప్రకారము మరల ద్వాదశాబ్దములు విపినవాసమును నొక్కయేఁ డజ్ఞాతవాసమును వారిచేఁ జేయింపవలెనని తలపెట్టి వారెచ్చట నున్నారో యెఱింగిరండని చారుల ననేకుల నన్ని దేశములకును బంపెను. ఎవ్వరికిని

పాండవులజాడ యిసుమంతయును దెలియలేదు. కాని వానిలో మిగుల బలాఢ్యుఁడైన మల్లుఁడొకఁడు విరటునికొలువుకూటమునకు వచ్చి యతని యాస్థానమునఁ గలమల్లురఁ దనతోఁ బోరాటమునకుఁ బంపుమనియు లేనిచో జయపత్రికల నిచ్చి పంపుమనియు గంభీరముగ మాటలాడెను. అందులకుఁ దగినవాఁడు తనకడలేకుండుటయుఁ దనబావమఱఁదియగు సింహబలుఁ డూరలేకుండుటయు నెఱిఁగి విరటరాజు తగిన యుత్తరము చెప్పఁజాలక యూరకుండఁ గంకభట్టు "రాజా! ఏలయట్లాలోచింతువు? మీమహానసమున వంటలుచేయువలలుఁడు బాహుయుద్ధమునఁ గడునిపుణుఁడు. వానింబిలిచిన నీతని ననాయాసముగా జయింపఁగలఁ"డని పలికెను. దానికి విరటుఁడు సంతసించి వలలునిం బిలిపించి మల్లునిపైకిఁ బంపనాతఁడు తృటిమాత్రములో నాతని నోడించెను. ఆవేఁగువాఁ డాతఁడు భీమసేనుఁడై యుండునాయని యనుమానమంది పోయి దుర్యోధనున కెఱింగింప నాతఁడు మఱియొకనిని యథార్థస్థితి తెలిసికొనిరమ్మని పంపెను,

విరటుని బావమఱఁది యగుసింహబలుఁడు గ్రామాంతరమేగి మరలవచ్చి యొకనాఁడు తోఁబుట్టువగు సుధేష్ణను జూడ నంతఃపురమునకుఁ బోయి యటచ సైరంధ్రి వేషధారిణియైయున్న ద్రౌపదిని జూచి యామె సౌందర్యమున కాశ్చర్యమంది ప్రేమించి యామెను దన యంతఃపురమునకు రమ్మని



కోరెను. అందుల కామె కంటగించుకొని భీమసేనున కావృత్తాంతము రహస్యముగా విన్నవింప నాతఁడజ్ఞాతవాసకాలమంతయుఁ బూర్తికానున్న సమయమున వానివలనఁ గార్యము చెడునేమోయని యెంచి బయలుపడకుండుటకై యెవ్వరు నెఱుగకుండ సింహబలుని నతని తమ్ములను నంతమొందించెను.

రెండవసారి పాండవులజాడ చూడనేగిన చారుఁడు విరటునగరమునఁ జాలకాలముండియును వారిపోలకువ కనుపెట్టఁజాలక మల్లుని జయించినవాఁ డగుటచే వలలునిమాత్రము బాగుగాఁ బరిశీలించి చూచియు నాతఁడే భీముఁడని నిశ్చయింపఁజాలక తిరిగివచ్చి పాండునందనులజాడ నాకుఁ దెలియలేదు. కాని యొక్కవిశేషముగలదని సింహబలుని దుర్మరణవృత్తాంతమెఱింగించి మీఁద దేవరచిత్తమని విన్నవించి చనెను.

సింహబలుని మరణవార్త వినినంతనే దుర్యోధనుఁడు గంధర్వుఁడను నెపమున భీముఁడు విరాటనగరమున నుండెననియు నాతఁడే మల్లుని జయించి సింహబలునిఁ జంపెననియు నిశ్చయించి తాము విరాటునిపశువుల నాక్రమించిరేని యచటఁ బాండవులు నిజముగా నున్నయెడల వచ్చి విడిపింపక పోరనియు నట్లువచ్చినపుడు వారిని గుఱుతించి సమయభంగమును దెల్పి మరలఁ జిక్కులుపెట్టవచ్చుననియుఁ దనమిత్రులతోఁ దన యూహ వెల్లడించెను. దానికందఱు నంగీకరించిరి.

భాద్రపదబహుళాష్టమీదినంబున దుర్యోధనునాజ్ఞ ప్రకారము త్రిగర్తదేశపాలకుండగు సుశర్మయను సామంత రాజు విరాటనగరము సమీపించి దక్షిణభాగముననున్న గోగణములను బట్టుకొనెను. గోపాలురుతమకుశక్తియున్నంతవఱకు సైనికులతోఁ బెనఁగులాడియు విఫలప్రయత్నులైపురమునకుఁ బఱువెత్తి విరాటరాజున కావార్త నెఱింగించిరి. విరటుఁడు సమరసన్నద్ధుండై సుశర్మపైకిఁ బోవుచుండ మనకంకభట్టు విరటుని సన్నిధికరిగి "రాజా! నావిన్నవించునంశమును సావధానముగాఁ జిత్తగింపుము. నాస్వవిషయములను గొంచెము విన్నవించెదను. ఆత్మస్తుతి యనుకొనక క్షమింపుము. నేను గాలవశమునఁ గొన్ని కారణములచేఁ బ్రస్తుతము సన్యసించినను గృహస్థుఁడనై యున్నపుడొకఋషికడ నాయుధముల ప్రయోగోపసంహార క్రమమంతయు నెఱిఁగి యున్నవాఁడనే. నీసేవ యొనర్చుచు నీయన్నము తినిబ్రతుకుచు నీకవసరమయినసమయమున సహాయపడక శరీరములను దాఁచుకొనుట ధర్మవిరుద్ధము. మహాభుజబలసంపన్నుఁడగు వలలుఁడును హయపరిపాలకుఁడగు దామగ్రంధియుఁ బశుపాలకుండగు తంత్రిపాలుండును వచ్చుటకు సంసిద్ధులై తమకుఁగల రణకుతూహలమును నీకో విన్నవింపుమనుచున్నారు. కనుక నాకును వారికిని దగిన రథములు నాయత్తపఱచి తెప్పింపుము." అని మనవియొనర్చి యనుమతి వడసి రథారూఢుఁడగు సోదరులతోఁ గూడిచనెను.



అప్పుడు విరాటసుశర్మలసైన్యములకు ఘోరసంగ్రామము జరిగెను. సుశర్మ మహాపరాక్రమముజూపి విరటుని రథము విఱుగఁగొట్టి యాతనిఁబట్టి తనరథమునఁ బెట్టుకొని తీసికొని పోవుచుండెను.

ఆసమయమున దూరమునఁ బోరుచున్న యుధిష్ఠిరుఁడు విరటరాజు శత్రుహస్తమునందుఁ జిక్కుటగనిపెట్టి విచారపరీతుండై భీమసేనునిదగ్గఱకు సత్వరముగాఁజని "సోదరా! చూచితివా! మనవిరటమహారాజు దురవస్థ. ఈతఁడు రథమును గోల్పోయి సుశర్మచేతిలోఁ జిక్కుపడెను. ఆదురాత్ముఁడీ మహానీయు నేమిచేయునోయని భీతికలుగుచున్నది. ఈతని యాశ్రయమువలననేగదా మనమందఱమును గొంచెమైనఁ గొఱంతలేక యజ్ఞాతవాసమును భద్రముగాఁ దాటఁ గలిగితిమి? ఇట్టి మహోపకారి విరోధులకు వశుఁడైయుండఁ జూచుచు నూరకుండుట మనకున్యాయముకాదు. కావున మనము నలువురమునుబోయి కంఠమునఁ బ్రాణములున్నంతవఱకును బోరి యెట్లయిన నీతని విడిపింపవలయును. ఆలసించినచోఁ గార్యముచెడును." అనిపలికెను. దానికి భీమసేనుఁడు "అన్నా! మనము కృతజ్ఞతచూపుటకుఁ దగినయదను దొరికినది. ఇంతమాత్రమునకు నీవుకూడ శ్రమపడవలయునా? నీవిచటనేయుండి చూచుచుండుము. ఈసాలవృక్షమును బెకలించి సుశర్మను వానిసైన్యములను సంహరించి విరటుని విడి

పించెద." అనివిజృంభించి వృక్షమునైపునకుఁ బోఁజూచెను. అజాతశత్రుఁడతని వారించి "తమ్ముఁడా! నీవిపుడు తొందరపడి వృక్షమును బెఱికి శత్రుసంహారమొనర్చినచో నిన్నుశత్రువులు తప్పక పోల్చుకొందురు. దానిచేఁ బ్రతిజ్ఞాభంగమై మనమనేకములగు చిక్కులకు లోఁబడవలసివచ్చును. మనయజ్ఞాతవాసపుగడువు నేటితోఁ బూర్తియగును. ఇంతలో వేగిరపడి నష్టము నొందుటయేల? కావున సామాన్యరీతిగనే పోయి కార్యము సాధించుకొని రమ్ము." అని మందలించి పంపెను.

భీమసేనుఁడతిసాహసముతో సుశర్మపైకుఱికి వానిగుఱ్ఱములనుజంపి యాతనింబట్టి కాలుసేతులుబంధించి ధర్మజాని కడకుఁ దీసికొనివచ్చెను. సేనాధిపతి బంధింపఁబడుటచే సైన్యములెల్లఁ జెల్లాచెదరై పఱువెత్తెను. యుధిష్ఠిరుఁడు తనకుఁ జేయించిన సహాయమునకుఁ గృతజ్ఞుఁడై విరటుఁడతనిని దనరాజ్యమును గైకొనుమనెను. కాని యాతఁడు వినయవినమ్రుఁడై "మహారాజా! నీవు సంవత్సరమునుండి మమ్ములను బోషించుచున్నావు. దానికై మాదేహములనైన నర్పించి నీకుమేలు గూర్పవలదా? నీరాజ్యము మాకేల? నీయనుగ్రహముండిన జాలును. అయినను నేనొక్కటికోరెద నదియొసంగుము. మనకుఁ జిక్కిన యీసుశర్మను సపరివారముగా విడిచిపెట్టుము." అనికోరెను. అతనికోరికప్రకారము విరటుఁడతనిని విడిచి



అనురునటిదినముననే దుర్యోధనుఁ డపారసేనాసమేతుఁడై పురమున కుత్తరముననున్న గోసమూహములను బట్టుకొనెను. సైన్యములన్నియు దక్షిణమువైపున కేగియుండుటవలన వారినెదిరించువారెవ్వరును లేరైరి. విరటుకుమారుఁ డుత్తరుఁడు తనకుఁ దగినసారథియున్న నాసైన్యముల జించిచెండాడుదునని బీరములువలుకుచు సైరంధ్రివలన బృహన్నల సారథ్యమున సమర్థుఁడనివిని యాతనిఁ దనరథమును దోలుమని కోరెను. అతఁడు మొదట నిష్టములేనట్లునటించి గడచిన దినముతోనే యజ్ఞాతవాసపుగడువు పూర్తియైనందున బయలువడినను నష్టములేదని యంగీకరించెను. ఉభయులును రథములనధిరోహించి పురము వెలువలికి వచ్చునప్పటికి శాత్రవసైన్యములు బాగుగానగబడెను. ఉత్తరుఁడుభయపడి రథముఱికిపాఱిపోవుచుండ నర్జునుఁడాతని నీడ్చుకొనివచ్చి రథమునకుఁగట్టి పూర్వపుజమ్మికడకుఁ దోలుకొనివచ్చి తానర్జునుఁడను వృత్తాంతమాతనికిఁ జెప్పి భయపడనవసరములేదని ధైర్యముచెప్పి వృక్షమందలి తనగాండీవమును గ్రహించెను. దైవానుగ్రహమున సంవత్సరకాలము పూర్తియగుటచేఁ జూచుచుండగనే యతనికిఁ బూర్వరూపమువచ్చెను. అర్జునుఁడు విజృంభించి యాకలిగొన్న సింగపుఁగొదమవలెఁ గౌరవసేనలఁ జీకాకుపఱచి సమ్మోహనాస్త్రముచే నందఱను బద్ధులనుగావించి దుర్యోధనుని సంహరించుటకు వీలుగలిగినను సోదరుని ప్రతి

జ్ఞవ్యర్థము కారాదను తలంపున నూరుకొని తమయావులను మరలించుకొని యాయుధములను దాఁచి పురమును బ్రవేశించెను.

విరటరాజు పురమునకువచ్చి యుత్తరుని గమనము విని యేమి హాని సంభవించునోగదాయని చింతించి యేమియును దోఁచక వినోదార్థము కంకునితో జూదమాడుచున్న సమయమున నొకభటుఁడువచ్చి యుత్తరకుమారుఁడు కౌరవసైన్యములను జయించెనని విన్నవించెను. దానికి రాజు మహానందమునఁ బొంగిపోయి యాతనిజయము పట్టణమందుఁ జాటింపుఁడని మంత్రులకాజ్ఞాపించెను. ఆమాటలువిని యుధిష్ఠిరుఁడు "రాజా! ఆసేనలను జయించినవాఁడుత్తరుఁడు కాఁడు. బృహన్నల. అతని విజయమునే జాటింపింపు"మనెను. విరటుఁడందులకుఁ గోపము తెచ్చుకొని యుధిష్ఠిరుని మొగముపైఁ బాచికలతోఁ గొట్టెను. ఆతనిముఖమున గాయముగలిగి రక్తము స్రవించుచుండ సమీపముననేయున్న సైరంధ్రివచ్చిరక్తబిందువులు క్రిందఁబడకుండ జీరకొంగుతో నద్దెను. "అట్లేలయద్దితి"వని విరటుఁడు ప్రశ్నింప "రాజా! ఉత్తమవంశమున జనించి పరమపవిత్రుఁడైన యీతనిరక్తబిందువులెన్ని యీభూమిపైఁబడునో యన్నివత్సరములీ దేశమున వర్షముపడక కఱవు సంభవించును. కావున నట్టిహానికి వెఱచి యట్లొనర్చితినని బదులు చెప్పెను.

ఇంతలో ద్వారపాలకుఁడువచ్చి యుత్తరుఁడును బృహ



న్నలయును వచ్చిరని విన్నవించెను. తనముఖముపై విరటుఁడొనర్చిన గాయముచూచి యర్జునుఁడు కోపించి విరటుని కేమైనహానిచేయునేమోయని యుధిష్ఠిరుఁడు భయపడి యుత్తరునిమాత్రములోపలబ్రవేశపెట్టించెను. విరటుఁడుత్తరునిఁ గౌఁగిలించుకొని కౌరవుల నాతఁడొక్కరుఁడును గెలచినందులకు శ్లాఘింప నాతఁడు తాను జయింపలేదనియు నొకదివ్యపురుషుని సహాయమువలనఁ దనకు జయము సంభవించెననియుఁ జెప్పె. ధర్మరాజు గాయమునుగాంచి కంకునకీగాయమెట్లుకలిగినదని యడిగెను. దానికి విరటుఁడు జరిగినవర్తమానమెఱింగింప నాతఁడు "తండ్రీ! బ్రాహ్మణుఁడే! అందును సన్యాసియే! ఆతనినిట్లవమానించుట తగునా? క్షమార్పణము చేసికొనుము." అనివిన్నవించెను. విరటుఁడు పశ్చాత్తప్తుఁడై తనయపరాధమును మన్నింపుమని యుధిష్ఠిరుని బ్రతిమాలెను.

ఆరాత్రి పాండవులేవురు నొక్కచోటఁ గలిసికొని మఱునాఁడు చేయఁదగినకృత్యములు నిర్ణయించుకొని యెట్లో వేగించి యుదయముననే స్నానాద్యనుష్ఠానములను దీర్చుకొని శుభ్రవస్త్రములధరించి చందనపుష్పాదుల నలంకరించుకొని రాజకుమారోచితవేషములతో సభాభవనమునకు విరటునికంటెముందు వచ్చిరి. యుధిష్ఠిరుఁడు విరటుని సింహాసనమునఁ గూర్చుండెను. తమ్ములు రాజార్హములగు పీఠములపై నాసీనులైరి. ఇంతలో విరటరాజువచ్చి సింహాసనమునగూర్చున్న ధర్మ

రాజునుజూచి కంకా! నేనువచ్చినను గర్వముతో దిగకున్నావు? అని యహంకారముతోఁ బలికిన దాని కర్జునుఁడు మందహాసము చేయుచు

ఉ॥ "ఈతఁడజాతశత్రుఁడు మహిందగ దిగ్విజయంబుచేసె వి
ద్యాతిశయార్థి వాసవు మహాఘనమైనను నెక్కనర్హుఁడు
ద్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁడార్యనికాయ సంతత
ఖ్యాతచరిత్రుఁ డీచిఱుతగద్దియకుందగఁడే నరేశ్వరా."

అని గంభీరముగాఁ బలికెను.

ఆమాటలువిని విరటుఁడు విస్మయసంశయములు మనంబునఁ బెనఁగొన నట్లయిన భీమార్జుననకుల సహదేవులును ద్రౌపదియు నెక్కడనున్నారని యడిగెను. అర్జునుఁడు తానుగాక మిగిలిన మువ్వురను వేఱువేఱ నిరూపించి చూపి సైరంధ్రియే పాంచాలియని యెఱిఁగించెను. భీముఁడర్జునునిఁ దెల్పెను. అర్జునుఁడీ కురుసేనలను జయించి గోవులను విడిపించినవాఁడని యుత్తరుఁడు చెప్ప విరటుఁడు మహానందమునొంది యాతనిం గౌఁగిలించుకొని తనకూతు నాతనికిచ్చి వివాహమొనర్చెద ననెను. ధనంజయుఁడందులకంగీకరింపక విద్యోపదేశకర్తనగు నేను తండ్రివంటివాఁడను గావున నాకిచ్చుట తగదు. మాయభిమన్యునకిచ్చి వివాహమొనర్పుమనెను. విరటుఁడంగీకరించెను. సుముహూర్తమున నుత్తరాభిమన్యులవివాహము లోకోత్తరముగా నెఱవేర్పఁబడెను.

# పదుమూఁడవ ప్రకరణము.



## సంధియత్నములు.

పెండ్లి యైదుదినములును గడచెను. ఒకదినమున భోజనానంతరమున యుధిష్ఠిరుఁడును భీమాదిసోదరచతుష్టయమును విరాట ద్రుపదులును శ్రీకృష్ణ బలరామ సాత్యక్యాది యాదవవీరులును బరిణయార్థమరుగుదెంచిన యితరసామంతధరణీరమణులును విరటుని కొలువుకూటమున నిండియుండి నానావిధసముచిత సంభాషణములను జరుపుచుండిరి. అపుడు శ్రీకృష్ణపరమాత్మ వివాహమునకు వచ్చినయందఱు రాజవరులమనస్సులను బాండవులయెడల ననురక్తములుగాఁ జేసి ముందుముందొకవేళ యుద్ధము కాక తప్పనియెడలఁ బాండవులకే వారందఱును సహాయమొనర్చునట్లు చేయవలయునని యెంచి లేచి యిట్లు పలికెను. "రాజపరేణ్యులారా! యుధిష్ఠిరాదులమామకులై మాయావియగు శకునిచేఁ గపటద్యూతమునఁ దమ రాజ్యమునుగోల్పడి సమర్థులయ్యును సత్యవాక్పరిపాలకులగుట వలన ధర్మబద్ధులై సమయప్రకారము పండ్రెండు సంవత్సరములును వన్యమృగములతో ఘోరాటవులందుఁ గడునిడుమలఁబడుటయుఁ బదుమూఁడవదగు నజ్ఞాతవాససంవత్సరమును సేవాదుఃఖములకైన నోర్చి సక్రమముగా జరుపుటయు మీయందఱును నెఱిఁగినయంశమే. మీయందఱును ధర్మజుని యోగ్యత

యొఱిఁగినవారే యగుటచే నేను వేఱుగా వివరింపవలయునవసరము లేదు. ఇతఁ డధర్మమార్గమున నింద్రపదవి లభించినను నంగీకరింపఁడు. కావున ధర్మప్రకారముగా సుయోధనుఁడు వారిరాజ్యమును సక్రమముగా నిచ్చుట శ్రేయము. అట్లీయని యెడలఁ దమభుజాబలపరాక్రమముచేతనే సంపాదించుకొనుటకు వీరుయత్నించుచున్నారు, ఈయత్నము వినినచో నాతఁడు సైన్యములను గూర్చుకొనును. పాండవులపక్షమునఁ జేరినమీరందఱును నిచటఁ జేరి సహాయముచేయవలసియున్నది. తుదకిది యొక మహాసంగ్రామముక్రిందఁ బరిణమించుఁ గలదు. అయినను నెదుటిపక్షమువారి యభిప్రాయ మెఱుఁగకుండఁ దొందరపడుట తగవు కాదు. కావునఁ దగినమనుష్యునచటికిఁ బంపి యతనియభిప్రాయమునుగూడ దెలిసికొనుట మంచిపని. దుర్యోధనుఁడు సక్రమముగా వీరికిరాజ్యమిచ్చినయెడల సరియే; లేనిచో యుద్ధము చేయకతప్పదు. ముందుఁగోరినవారికే సహాయముచేయుట రాజులకు ధర్మముగనుక సంధియేకుదురునని మనముపేక్షించినచో నీలోపున నాతఁడందఱసహాయమును దానేకోరుకొనును. తుదకవసరమయినచో మనకుసహాయముఁ జేయువారుండరు, కనుక మనము సంధిప్రయత్నములు చేయుచున్నను గేవలమును నేలవిడిచి సాముచేయుటయుచితము కాను. కావునఁ బాండవులితరరాజులనుగూడ సహాయమిప్పుడే కోరుట యుచితము. మీరందఱు నిప్పటినుండియుఁ దగినసన్నాహములు చేయుచునుండవలయునని నాకోరిక" అని.



బలరాముఁడు కృష్ణునిపలుకులు సమర్థించుచు దుర్యోధనునియెడలఁగూడ దోషము లేదు. కావున మనము వినయముననే కార్యము సాధించుకొనుట మంచిదని తనశిష్యాభిమానము వెల్లడియగునట్లు పలికెను. సాత్యకి యామాటలనుఖండించి న్యాయముగా రావలయుభాగమును గ్రహించుటకు దైన్యముచూపనవసరము లేదని నొక్కి పలికెను. అచటనుండు నితరరాజులందఱును సంధికుదురనియెడలఁ బాండవులపక్షముననుండి పోరుటకు మాటయిచ్చిరి. విరాటద్రుపదులును బాండవులును సమరసన్నాహముల నొనర్చి తమకనుకూలులయి యచటికి రానియితరరాజులపాలికి దూతలనుబంపిరి. చారులవలన దుర్యోధనుఁడీ వృత్తాంతమును విని తనబంధుమిత్రాదులకు వర్తమానములంపుచుండెను.

ద్రుపదుఁడు తనపురోహితునిఁ బిలిచి ధృతరాష్ట్రుని కడకుఁ జని పాండవులు తమసమయప్రకారముగాఁ బదుమూఁడేండ్లునుగడపి వచ్చిరి. కావున నిఁక వారిరాజ్యము వారికియ్యవలయును. యడుగుమని పంపెను.

యుధిష్ఠిరుఁడు సమరసమయమునకై యితరరాజన్యులందఱకు వర్తమానములుచేసి తనమేనమామయగు శల్యునికడకుఁగూడ నాప్తులైన బంధువులను బంపెను. ఆతండును బరమప్రీతితోఁ బాండవులకు సహాయముచేయఁగోరినానాసేనలతో గదలి పాండవులున్నయుపప్లావ్యమునకు వచ్చుచుండెను. చా

రులవలన నిదియంతయు దుర్యోధనుఁడెఱింగి నేర్పరులగు పని వారలను దోడ్కొని బయలుదేఱి శల్యుఁడు రాఁబోవుమార్గమున బసలుచేయవలసిన ప్రదేశములయందతనికినిబరివారమునకును గుఱ్ఱములు యేనుఁగులు మున్నగువానికిని నివాసప్రదేశములు భోజనాదులును సమృద్ధిగా బహుసుఖవంతములుగానుండునట్లేర్పఱచి తానుగూడ మారువేషముధరించి కూడ నడచుచుండెను. ఇట్లు రెండుమూఁడు మజిలీలలో సర్వసమృద్ధిగా సదుపాయములు జరుగుటకు శల్యుఁడు మిగుల సంతసించి యదియంతయు యుధిష్ఠిరుని పనివారలు చేయుచుండిరని యపోహపడి ఇట్లు మిగుల నేర్పుతో మనకుపలయువాని నెల్లసంపాదించి యిచ్చు యుధిష్ఠిరుని మంత్రులనిచటికిదోడ్కొనిరండు. వారల కోరిక తీర్చెదనని తనవారితోఁ బలికెను. ఆమాటనోటనుండి వచ్చియు రాకుండఁగనే యదియే మంచిసమయమని సుయోధనుఁడు బయలుపడి వినయముతో నమస్కరించి "మామా! ఈ సదుపాయములు చేయువారికోరికతీర్చెదనంటివి. అనిన మాటనిలుపుకొని నాకమాత్యుఁడవై పాండవులకును మాకును జరుగఁబోవుయుద్ధమున నాపక్షముననుండి సేనలనుగైకొని పోరాటమునలుపుము. ఇదియే నాకోరిక"అని ప్రార్థించెను.

శల్యుఁడు మిగుల మొగమోటము గలవాఁడు. ఎవ్వరికేది తోఁచునో దాని నొనర్చుటయు నందఱకును ముఖప్రీతి మాటలాడుటయు నీతనిస్వభావము. ముందుగా యుధిష్ఠిరుని



దూతలు తన్నుఁబిలిచిరనియు నందువలననే తానుససైన్యముగాబయలుదేఱి వచ్చుచుండెననియుఁగూడ నీతఁడాలోచింపక యుధిష్ఠిరుని మంత్రులయినచో వారికోరికలనేనేనుదీర్తునంటినని యెఱింగించియైనను దప్పించుకొనక దుర్యోధనుఁడు కోరినప్రకారము తప్పకచేయుదునని వాగ్దానముచేసెను. మీఁదుమిక్కిలి "ఇంతే కాదు. ఇంతకంటె నెక్కువగా నేమైనఁగావలసిన నదియును జేసెద"నని పలికెను గాని సుయోధనుఁడంతమాత్రము చాలునని సెలవుగైకొని చనియెను.

శల్యుండు కతిపయప్రయాణముల నుపప్లావ్యమునందు ధర్మనందనుం డుండుతావునకుఁబోయెను. ఆతఁడు దమ్ములును ద్రౌపదీసుభద్రలు అభిమన్యుఁడు మున్నగు పుత్రవర్గముతో నాతని కెదురుగా జని నమస్కరించి యర్ఘ్యపాద్యాదులఁబూజించి కుశలమడిగెను. పిదపఁ బరస్పరమును గొంతసంభాషణము జరిగిన యనంతరమున శల్యుఁడు దుర్యోధనుని విషయమున దానుబొరపడి చేసిన వాగ్దానము నెఱింగించెను. అది యుధిష్ఠిరుని మనస్సునకు మిగులఁ గష్టము నేకలిగించెను. కాని యతఁడు తనహృదయభావమును బైకిఁదోఁపనీయక దానుముందుగాఁ గబురుపంపుటచే నాతఁడు ససైన్యముగాఁ దనకు సహాయము చేయఁగోరి వచ్చుచుండ మోసముగా నాతనిఁ దనపక్షమునకు ద్రిప్పికొనిన దుర్యోధనుని విషయమున మరల మోసమునే యుపయోగించుట రాజనీతికి విరుద్ధము

కాదనియెంచి శల్యుఁడు మాటప్రకారము శత్రుపక్షమునకే యేగినను నుపయోగముమాత్రము తమకే కలుగునట్లు చేసి కొనఁగోరి తనమాట శల్యుఁడు నిరాకరింపఁడను ధైర్యముగల వాఁడగుటచే నతనితో నిట్లువిన్నవించెను. "మామా! మంచి పనిచేసితిరి. మాకాప్తులైనమీరు శత్రుపక్షముననుండుట నాకు సంతోషకరమే. పెద్దలగుమీవంటివారి కితరులకోరికలు తీర్చుట సహజధర్మమేకదా! కావున నేనుగూడ నొకటివేడుచున్నాను. అంగీకరించి నన్ను మన్నింపుఁడు. సమయప్రకారము ధర్మబద్ధులమై వనాజ్ఞాతవాసములు సలిపివచ్చి మాభాగము మేముకోర దానికంగీకరింపక దుర్యోధనుఁడు యుద్ధప్రయత్నములుచేయుట యొకలోపము. నేనుయుండువర్తమానమంప మత్సహాయమునకై మీరువచ్చుచుండ మోసగించి నామంత్రులనుకొని పొరపడి మీరొనర్చిన వాగ్దానమును వంచనచే దానుగ్రహించుట రెండవలోపము. ఇట్టి మోసకృత్యములనే యొనర్చువాతనికి మీరొక్కమోసముచేయుట రాజనీతిబాహ్యముకాదు. కనుక నాకోరిక వినుండు. మనపార్థునకు శ్రీకృష్ణుఁడు సారథ్యముచేయఁగలఁడు. కర్ణుఁడు పార్థునితోనే యుద్ధమునకు డీకొనుచుండును. కనుక వీరిరువురకును సంగ్రామము కాకతప్పదు. కర్ణునకు సారథ్యముచేయుటకుఁ గృష్ణునితో సమానులు మీరే. కాని యితరులుగానరారు. ఈవిషయమున దుర్యోధనుఁడు మిమ్మేతప్పక నియోగింపఁగలఁడు. కనుక సమ



రసమయమునఁ గర్ణునకుఁ దేజోహీనములైనమాటలాడి మనస్సుకలఁచి వానివలన మనయర్జునునకు బాధకలుగకుండరక్షింపవలయును. రాజనీతిసమ్మతంబగుదీని సత్కృత్యమనుకొని యనుమానించి మానికేయక నాప్రార్థనాప్రకారము తప్పక యట్లు చేయవలయును" శల్యుఁడు దానికిఁ బరమాదరమున నంగీకరించి తనయులనాటుప్రకారము యదిమాత్రమే కాక యింకేది చేయుమన్నను జేయుదునని పలికి యొక్కొక్కప్పుడు శత్రువిజయమునకై మోసముపయోగింపక తప్పదని వృత్రాసురసంహారకథను జెప్పియోదార్చి తానుబయలుదేరి హస్తినాపురమునకుఁ బోయెను.

దృపదుని పురోహితుఁడు హస్తినగరమునకేగి ధృతరాష్ట్రునిచే నాదరింపఁబడి భీష్మద్రోణకృపకర్ణ సౌబలవిదురాదుల సమక్షమునఁ "బాండుకుమారు లనుకొనినప్రకారము సమయమునిర్వహించుకొని వచ్చిరి, కనుక వారిసగపాలురాజ్యమును వారికీయవలయునని వారుకోరుచున్నా"రని ధృతరాష్ట్రదుర్యోధనులతోఁ బలికెను. దుర్యోధనుఁ డంగీకరింపక సూదిమొనమోపినంతయైన వారలకీయనని ఖండితముగాఁ బలికెను. ఒకవేళవారు యుద్ధమునకెత్తివచ్చినను నేనునీకు జయముగూర్చెదను గావున సంధికి నీవొడంబడవలదని కర్ణుఁడాతనిఁ బ్రోత్సహించెను. ఆమాటలకు భీష్ముఁడు మండిపడి వానియొక్కనివలనఁ గులమంతకును నాశము సంభవింప నుంకుటకు

పగచి యాతనిఘోషయాత్రాగోగ్రహణ సమయములందలి యపజయములనుగ్గడించి "యక్షేయీయుద్ధమునందును నీవు పరాక్రమముచూపింతువు. నీశౌర్యము మేమెఱుంగనిదా?" యని యెత్తిపొడిచెను. కర్ణుఁడంపులకుఁగోపించి కాఁబోవు యుద్ధమునందు భీష్ముఁడు రణభూమియందు యుద్ధముచేయు చున్నంతవఱకును దానాయుధము పట్టనట్లు శపథముపూని సభాభవనమునుండి దిగ్గునలేచిపోయెను. అతనిమైత్రికోరువా రగు దుర్యోధనాదులు వానిననుసరించి లేచిపోయిరి. దాని వలన సభయంతయు సల్లకల్లోలమయ్యెను. ఈసందర్భమున ధృతరాష్ట్రునకు మతిపోయినట్లయ్యెను. అప్పటికర్తవ్యమాత నికేమియుఁ దోఁచలేదు. కావునఁ బాండవదూతతో "అయ్యా! సంధివిషయమున మేమందఱమును నాలోచించి మాయభిమ తమును వెనుకనుండి వర్తమానముచేయుదుము. మీరుముం దుదయచేయుఁడని" సాంతనపూర్వముగాఁబలికి గౌరవించి పం పివేసెను. పిదపరెండుమూఁడు దినములకతఁడు సంజయునికిఁ గర్తవ్యమును బోధించి పాండవులవద్దకుఁ బంపెను.

సంజయుఁడు కతిపయప్రయాణంబుల నుపప్లావ్యము నకువచ్చి ధర్మనందనుఁడు కృష్ణుఁడు సహోదరులు మున్నగు వారితోఁగొలువున్నసమయమున సమీపించి నమస్కరించి ధృతరాష్ట్రుఁడు మీయోగక్షేమముల నరసిరమ్మని నన్నుఁ బంపెనని విన్నవించెను. "అమహారాజునకు మాయందుఁగల



కటాక్షమువలన నిట్లుసుఖముగా నున్నాము. మాక్షేమము కనుఁగొనుమని నిన్నుఁబంపుటకు వారిమనసు మిగులసంతోషిం చుచున్నది. అతఁడును బుత్రులును భీష్మాదివృద్ధులును ద్రోణా దిగురువరులును సుఖులైయున్నారా? బ్రాహ్మణులకు సరిగా మన్ననజరుగుచున్నదా? మేమిచ్చిన దేవబ్రాహ్మణవృత్తులు సరిగాఁజెల్లుచున్నవా? ఇతరరాజులతో వివాదములు సంభవిం పవుగదా? అట్లొకవేళ సంభవించినయెడల నారుమాతమ్ము ల భుజాబలంబు తలంచుకొనుచుందురా? అనేకసందర్భముల యందు వారిపరాక్రమము కన్నారఁగాంచియు మఱచుట యెట్లు? ఘోషయాత్రయందు జరిగినవిశేషములును,గోగ్రహ ణసమయమందలి వృత్తాంతములును వారికి జ్ఞప్తియందుండక పోవునా? అర్జునుని యుద్ధమునందెదిరించి యేవీరుఁడైనను బ్రాణములతో మిగిలి యావలకురాఁగలఁడా ? అదియటుండ నిమ్ము. దుర్యోధనునికి బహిఃప్రాణమై మంత్రిత్వమును వహిం చుకర్ణుని గొప్పదనము సరిగాజరుగుచున్నదిగదా?" అనియుధి ష్ఠిరుఁడు తనకు వారందఱయెడలనుగల భక్తిస్నేహభావముల నగపఱచుచు నట్లనురాగముచూపుట యసమర్థతచేతఁ గాదు సుమాయని తెల్లమగునట్లు గాండీవిపౌరుషము నుగ్గడించి యా తఁడొక్కఁడే యెదిరిపక్షమునంగల మహావీరులనందఱను జయింపఁగలఁడను తనధైర్యము వెల్లడియగునట్లు మాటలాడి సుయోధనుని దుర్మార్గప్రవర్తనయంతయుఁ గర్ణునిదుర్మంత్రి

ముపై నాధారపడియున్నదినుమా? యను తనయభిప్రాయ మును దేటపఱచెను. పిదప వారియిరువురకు నీక్రిందిసంభాషణము జరిగెను.

సం--దేవా! కురురాజునొద్ద నొక్కకర్ణుని వంటివారే కాదు. అవినీతులు, నీతిమంతులు, సత్త్వసంపన్నులు, దురహంకారులు నింకను ననేకప్రకారములు గలవారు పెక్కుమంది గలరు. వారిలో నొకరిమాట యొకరికినచ్చదు. వారిజోలి యేల? ప్రస్తుతమున నామనవి చిత్తగింపుము. వారిక్షేమము నుగూర్చి ప్రశ్నించితివి. నీవు చల్లనిమనస్సుగలిగి వారితో మైత్రినెఱపుటకు సంసిద్ధుఁడవై యుండుటవలన నికముందు వారికి క్షేమమేతప్పకకలుగును. ధృతరాష్ట్రుఁడు వృద్ధుఁడగుటచే మనస్స్థిమితములేక పూర్వము కుమారుల దుర్మార్గతను మాన్పలేదు. పిదప మిగులఁ బశ్చాత్తప్తుఁడై యీవిషయమున మహాభిమానముగానున్నాఁడు. మీయందలిప్రేమచేత నన్నుఁ బంపుచు రథమును దానశ్వయముగా నుపాయముచెప్పి సిద్ధపఱచి పంపించెను. ఆతఁడిట్లుమీయెడల సుముఖుఁడైయున్నపుడే మనము మంచిగాఁ గార్యముసాధించుకొనుట మంచిది. సర్వధర్మములునెఱిఁగి మహాశాంతులని ప్రసిద్ధివహించిన మిముబోఁటిపెద్దలకుఁ దేలికపడి దండోపాయమునకుఁ బూనుకొనుట ధర్మముగాదు. దుర్యోధనుఁడు దుర్మార్గుఁడై యకృత్యములొనర్చి కులమునకుఁ గళంకము తెచ్చిపెట్టినను దానిని



నీయోగ్యతచేఁ దొలగింపవలసియున్నది. కనుక యుద్ధమును మాని కులమునిలుపుము. ఆబాలవృద్ధముగా బంధుమిత్రులను ప్రముఖులనందఱఁ జంపినపిదప రాజ్యము మీకులభించినను సుఖమేమి? అయినను జయాపజయములు దైవాధీనములు గదా! మీపక్షమున శ్రీకృష్ణుఁడు, భీమార్జునులు, సాత్యకి, విరాటుఁడు ద్రుపదుఁడుమున్నగు మేటికిరీటులవంటివారు గలరు. వారిపక్షమునఁగూడ భీష్మద్రోణకృపాశ్వత్థామలు కర్ణశల్యులు సుయోధనునికొఱకై తమప్రాణములనైన విడుచుటకు సిద్ధముగానున్నారు. అతనితమ్ములుగూడ మహాపరాక్రమసమన్వితులు, బాహ్లీక సోమదత్తాదులు ఫాలాక్షునికైనను వెనుదీయరు. ఇట్టి మహాపరాక్రమసమన్వితులగు నీయుభయపక్షములవారికి నన్యోన్యకలహమెంతమాత్రమును శ్రేయస్కరముగాదు. కావున మీరు క్రోధమునువిడిచి వారితో మైత్రి యొనర్పగోరుచున్నాను. అట్లయిన ధర్మవేత్తయు మీకు బహూపకారియు నగు భీష్ముఁడును మిగుల సంతసిల్లును. పిదప దేవరచిత్తము.

యు--సంజయా? యుద్ధము యుద్ధమని యట్లుభయపడుచున్నావు. నామాటలయందన్యాయముగాని యుద్ధయత్నముగాని యించుకైన నీకుఁగన్పట్టినదా? యుద్ధమక్కఱలేకయే కార్యముసిద్ధినొందుట మాకుమాత్రమిష్టముగాకుండునా? అయిన నొక్కమాట వినుము. మాపెద్దతండ్రి తాను నావిషయ

మునఁ గేవలమన్యాయమార్గము నవలంబించి మమ్ములఁ బలుకష్టములపాలుచేసి యిప్పుడు మమ్ము మంచిమార్గమున నుండుఁడని బుద్ధులు చెప్పుట తగునా? ఎదుటివారిని దమవలెనే చూచుకొనవచ్చునో పొత్తుకుదురునా? అయినను సంపదలనుగోలుపోయి యశక్తులమైయున్న మమ్ములను బిలిచి పూజించుటకు మాతండ్రియంత తెలివిమాలినవాఁడా? అట్టివాఁడేయైన మొదటనే యీకార్యమునకుఁ బూనుకొనవలదని బోధించినవిదురాదుల మాటలు విని యేయుండును. కావున లేనిపోని యాశలు పెట్టి మమ్ము బాధింపకుము. అతనిచరిత్ర నీకును మాకును గ్రొత్తకాదు. అతఁడు కొడుకువిషయమున గ్రుడ్డియైయున్నను దానివలన నేదైన లాభము కలుగునేమోయని చూచుచుండును గాని పైవాఁడు చెప్పుమంచిమాటల నించుకయు నంగీకరింపఁడు. ఇఁకఁ గొడుకన్ననో యుద్ధమునఁ బ్రాణములు కోల్పోవనైన సిద్ధముగానున్నాఁడు గాని రాజ్యభాగమును జేతులారనీయఁడు. అట్టియెడల మేమేమి చేయవలయునో నీవే యోజింపుము.

సం — దేవా! వారియెడల నెట్టితప్పులున్నను మన్నించి నీవు శాంతమువహింతువుగావునను హింసాకార్యమునకుఁ జోరవుగావునను నిట్లు చెప్పఁగలుగుచున్నాను. కౌరవులు దుశ్శీలురై మీభాగమీయక మూర్ఖించినను యుద్ధమున వారలనందఱను జంపి నెత్తుటికూడు తినుటకంటె సత్ప్రవర్తకులగు మీరు భిక్షమెత్తుకొని భుజించుటయే శ్రేయము. రాజసూయమహాయజ్ఞ



మొనర్చి దేవతలకును సంతృప్తి యొనర్చి పొగడ్తకెక్కిననీవు నిట్టిహింసాకార్యమునకుఁ బూనుకొని కళంకమునొందుట తగదు. సమయపరికారమన్ని బాధలను నోర్చుకొని మాటనిలుపుకొనిన నీవీసమయమున యుద్ధమునకుఁ బూనుకొని బంధువులు గురువులు మున్నగువారిని వధించుట మొదటఁ బొందిన గౌరవమును జెఱచుకొనుటయేగాని వేఱుగాదు. కావున నధర్మమగు యుద్ధమునుమాని శాంతము వహించుట నామతము.

యు — కొన్ని కార్యములు ధర్మములవలెనుండి విచారింప నధర్మములగును. కొన్ని యధర్మములవలెనుండి యాలోచింప ధర్మములే యగును. నేనొనర్పునది ధర్మమో యధర్మమో పరికించి పిదప నన్ను నిందింపుము. కోపమువిడుచుట యహింసయును నవి యుత్తమధర్మములే; కాని వంశదూషకులను లోకకంటకులును నగుపాపాత్ముల నిర్మూలించుట క్షత్రియులకు ధర్మమేయని పెద్దలు చెప్పుదురు. అది యటుండనిమ్ము. యుద్ధము క్షత్రియధర్మమగునో కాదో నీవే చెప్పుము. అయినను ధర్మాధర్మనిర్ణయ మొనర్చి మనలను మంచిమార్గమున నడుపుటకు శ్రీకృష్ణపరమాత్మయే యిచటనుండ నేను పెక్కుమాటలు పలుకనేల? ఈపట్టివాగ్వాదమేల? ఈమహాత్ముని యానతి ప్రకారము సంచరింప సంసిద్ధుఁడనై యున్నాను.

సం — మహానుభావా! శ్రీకృష్ణప్రభూ! కర్తవ్యమును బోధించి మమ్ముద్ధరింపవా?

శ్రీ—సంజయా ! నేనెప్పుడును ధర్మప్రవర్తకులగు పాండుకుమారుల హితమునే కోరుచుందును. అయినను బుత్రపౌత్రవర్గముతోఁ గూడిన యాంబికేయుం డిట్లు చెడుమార్గమున సంచరించుచున్నాఁడే! పాపము! వీరివంశమున కేమి కీడు మూఁడనున్నదో కదా యనికూడ విచారించుచుందును. అట్టివిచారమక్కఱలేకుండఁ దెలివిగలిగి యాతఁడు మంచిమార్గమునకు వచ్చి వీరిని బ్రసన్నులఁ జేసికొనుటకు నిన్నుఁ బంపెనుగదా ! ఇఁక భయములేదని మిగుల సంతసించుచున్నాను. నీమాటలును గడుముదమును గూర్చెను. కాని ధర్మజుని మాటలధోరణిని బట్టిచూడ నీయభిప్రాయమున కనుకూలముగా సంధి కుదురు నట్లు తోఁచుటలేదు. దుర్యోధనుఁడు మిగుల దురభిమాని. ధృతరాష్ట్రుని మనస్థితి పూర్వమునుండియు నెఱిఁగినదే కాని క్రొత్తకాదు. అతని ప్రేమను నీవు తియ్యనిమాటలతో వర్ణించి చెప్పినంతమాత్రమునఁ దృప్తిలేదు. తమభాగమునియ్యని యెడల వీరెంతమాత్రమును సంధికంగీకరింపరు. ఎంతప్రయత్నించినను దమభాగమీయనప్పుడు యుద్ధమువలననే పడయఁగోరుట ద్రోహకార్యము కాఁజాలదు. అవమానముల కెల్లనోర్చి యిట్టినికృష్టస్థితియందుండుట కంటె యుద్ధమునఁ బరాక్రమము చూపుటయే క్షత్రియులగు వీరికుత్తమమని నాయభిప్రాయము. ధర్మశాస్త్రకర్తలు క్షత్రియులు దానమిచ్చుటకే గాని పుచ్చుకొనుటకుఁ దగరని నిర్ణయింపలేదా ?



అట్టిచో దయాధర్మపుబిచ్చముగా శత్రులకడనుండి రాజ్యము నడిగికొనుట తగునా ? సర్వవర్ణాశ్రమధర్మపరిపాలకులగు రాజులే నిజధర్మమువదలినఁ బ్రజలు ధర్మముగ సంచరింతురా? ఇంతే కాదు. ధర్మము తప్పకుండ నార్జించుకొనినధనముల ననుభవించుచు సన్మార్గమున నడచువారలకు దురాత్ములన్యాయముచేసిన యెడల నుపయోగించుటకే కదా యింద్రాదు లాయుధశాస్త్రము నేర్పఱిచి యుంచిరి? ఇట్టిసమయముననే గాక మఱెప్పుడు వీరాయుధశక్తిచూపుట? ముందువెనుకలు చూడక దుర్వృత్తివహించు కౌరవులకు నీవీధర్మమార్గమును బోధింపవలదా ? నిండుసభలోఁ బరమపతివ్రత నట్టిబాధలు పెట్టుచుండ నందఱును జూచుచు నూరకుండిరి గాని యధర్మమని నివారింపఁగలిగిరా? అప్పుడే వారి దుర్వృత్తినివారించిన నెంతమందిమనస్సులు సంతుష్టినొంది యుండును ? పాపము ! ద్రౌపది యితరులు తన్ను రక్షించువారు లేనందునఁ దానే యాత్మరక్షణమొనర్చుకొనవలసి వచ్చెనుగదా ? కర్ణుఁడు దుర్మదుఁడై "నీమగలందఱును బరాధీనులైరి. నీయందుఁ బ్రేమగల మఱియొకని భర్తగావరింపు"మని కర్ణశూలములగు మాటలాడుట నీవు వినలేదా ? ఆమాట యర్జునుని హృదయమున శల్యమువలెఁ జిరకాలము క్రిందనే గ్రుచ్చుకొన్నను దాని కితఁడు ప్రతిక్రియచేయఁ గలిగెనా? దుశ్శాసనుఁ డనినట్లు వీరు నిజముగాఁ బరాక్రమహీనులేయైరి. కాని యి

ప్పుడు తమరాజ్యమీయనిచో సంధికొడంబడరు. నే నీసంధి మాటలాడుటకు నీవెనుకనే కురుసభకు వచ్చెదను. కనుక నీసందర్భము లన్నియు నీవేగి ముందుగా వారల కెఱింగింపుము.

సం--చిత్తము. తామీ విజయము చేసిన యెడలనంతయు సక్రమముగానే యుండును.

సంజయుఁడు సెలవుగైకొని ప్రయాణము కాఁగా యుధిష్ఠిరుఁ డాతని గౌరవించి "సంజయా! హస్తినగరమునందలి గురుబంధుమిత్రాదుల నందఱను నా బాలగోపాలముగఁ గుశల ప్రశ్న యొనర్చినట్లు చెప్పుము. మా పెదతండ్రితో మా సగ పాలు రాజ్యము నిచ్చివేసిన యెడల గతమునందు వారు మా కొనర్చిన యపకారముల నెల్ల మఱచి స్నేహము చేయుదుమని చెప్పుము. అంత యీనోపరేని కుశస్థలము, వృకస్థలము వాసంతి వారణావతము నిచ్చినఁ జాలును. అదియు నీయఁజాలనియెడల మాకైదుగురకు నైదుగ్రామములైనఁ దన యిచ్చ వచ్చినచోట నిమ్మనుము. అట్లయినఁ గురుపాంచాల యాదవ మత్స్యదేశముల వారు పరస్పరస్నేహభావముతో సంతోషముగా నుండవచ్చుననుము. దేనికిని నంగీకరింపనియెడల యుద్ధముతప్పదని చెప్పుము" అని చెప్పి పంపెను.

యుధిష్ఠిరునకు యుద్ధమనిన నెంతమాత్రము నిష్టము లేదు. దానివలనఁ గలుగుకష్టములును నష్టములును నాతఁడు



బాగుగా నాలోచించుకొనెను. తామైదుగురును కౌరవులు నూఱుగురును గలిసిసుఖముగ నుండుటయే యాతనికి శ్రేయముగాఁ దోఁచెను. అతఁడు శ్రీకృష్ణునిఁ బ్రార్థించి యెట్లయిన సంధిచేసికొనిరమ్మని బ్రతిమాలెను. అతఁడు కతిపయమిత్రవర్గముతోఁ గదలి హస్తినాపురమునకుఁ బోయి ధృతరాష్ట్రునకు యుధిష్ఠిరుని యభిమతమును వివరించి చెప్పెను. భీష్మాదులందఱును ధర్మజుఁడు మిగుల ధర్మాత్ముఁడనియు, భూమినంతను జయింపఁగల సహాయాదరులున్నను నాతఁ డింతస్వల్పము కోరుచున్నపుడు తప్పక యిచ్చి గౌరవించుటయే యుత్తమమనియుఁ దమయభిప్రాయములను దెలిపిరి. దుర్యోధనుఁడు మాత్రము మునుపటివలెనే సూదిమొనమోపుటకుఁ దగినతావైన నీయననెను. సభముగిసెను.

ధృతరాష్ట్రాదులు తన్నుఁ బ్రార్థించినను గృష్ణుఁడు వారి యింట భుజింపక విదురునింట విందు నారగించెను. మఱునాటి దినమున నాతఁడు సభకు వచ్చినపు డాతనిని బాధించి చెఱలో నుంచవలయునని దుర్యోధనుఁడు తలంచి యట్టియత్నమును జరపియుంచెను. వ్యాసమహర్షియుఁ దల్లిదండ్రులును దన్నుఁ బిలిపించి సంధికొప్పుకొనుమని యెంతబ్రతిమాలినను నాతఁ డంగీకరింపక మరలిపోయెను.

మఱునాటి దినమున మరలసభ జరిగెను. భీష్మాదివృద్ధులును మహాబుద్ధిమంతులగు విదురాదులు వ్యాసాదిమహర్షుం

లును సభనలంకరించిరి. కృష్ణపరమాత్మయు నేతెంచెను. దుర్యోధనుఁ డాతని బంధించుటకుఁ దగిన పరికరములతో సిద్ధముగ వచ్చెను. శ్రీకృష్ణుఁ డదిగ్రహించి "దురాత్మా! నన్ను బంధించుట నీకు శక్యమగునా? అట్లయిన నిదిగో నా స్వరూపమును జూచి మఱియు బంధింపు"మని దివ్యరూపమును జూపెను. ఆతని ప్రక్క నాయుధధారులై పాండవులును, శరీరమున బ్రహ్మేశానాది దేవతలు, మునులు, నేత్రముల సూర్యచంద్రులు మున్నగువారందఱును నగపడిరి. భీష్మాదిమహాభక్తులందఱును వివిధస్తుతుల నామహాత్ముని గొనియాడిరి. కృష్ణుని కరుణచే దివ్యదృష్టినంది ధృతరాష్ట్రుఁడు నామహనీయుని దివ్యమంగళ విగ్రహము తనివి తీరఁ జూచి సంస్తుతించి "దేవా! యజ్ఞులగు నాకుమారులొనర్చిన యపరాధము మన్నించి శాంతింపు"మని ప్రార్థించి నమస్కరించెను. శ్రీకృష్ణుఁ డారూపమును నుపసంహరించి యెప్పటి రూపము ధరించి సభామందిరమును వీడి బయటికి వెడలిపోయెను.

అతఁడు తిన్నగా విదురునింటికిఁ జని కుంతికి నాఁటి సంధి విషయములు తెలిపెను. ఆమె "కృష్ణా! నాకుమారుల నిఁక వచ్చి తమ క్షత్రియజన్మములను బరాక్రమములను సార్థకము చేసికొనుఁడనుమా" అని చెప్పెను. నగరమునుండి బయలువెడలి వచ్చుచున్న యాతనిని గొంతదూరమువఱకును కర్ణుఁడు వెంబడించెను. అపుడు కృష్ణుఁ డాతని జన్మరహస్యమును దెలి



పి పాండవులు నీతమ్ములు. వారిపక్షమునకు రమ్మని కోరెను. "ఇంతకాలమునుండియుఁ బోషించిన దుర్యోధనుని విడువఁజాలను. అట్లు విడిచినఁ గృతఘ్నుఁడనగుదును. నాపౌరుషము పరిహాసపాత్రమగును. నీసహాయమునఁ బాండవులకు జయము చేకూరునని యెఱుఁగుదును. అయినను దుర్యోధనుని మోసగింపఁజాలను. క్షమింపుమని" యతఁడు బదులుపలికెను. ఆతని దృఢమనస్కతకును స్వామిభక్తికిని శ్రీకృష్ణుఁడు మిగుల సంతసించి యాతని వీడ్కొనిచనెను.

---

## పదునాలుగవప్రకరణము.

### యుద్ధము.

శ్రీకృష్ణపరమాత్మ కరినగరమునుండి త్వరితప్రయాణములనుపప్లావ్యమునకు వచ్చి యచట జరిగిన విషయమెల్ల ధర్మజునకు విన్నవించి యెన్నివిధముల యత్నించినను సంధి కుదురునను నాశ లేదని తెలిపెను. దుష్టశిక్షణకై యవతరించిన యాదేవదేవునకు మొదటి సంధికిఁ బోవుట కిష్టమే లేదు. అయినను బ్రయత్నింపక విడిచినచో "యుధిష్ఠిరుఁడు తొందరపడుట వలనఁ గురుకులమంతయు నశించెను. ఆతఁడు శ్రీకృష్ణసహాయమున సంధికై యత్నించిన యెడల నీవంశజులందఱును సురక్షితులై యుందురుగదా!" యని శాశ్వతముగ జనాపవాదము

ధర్మజునిపైనిఁ దనపైని నిలిచిపోవుట కిష్టములేక యీసంధికార్యమునకై యత్నించెను. నిజముగా యత్నించినయెడల నఘటితఘటనాసమర్థుఁడగు నాతని కశక్యమగు కార్యముండునా ? యుధిష్ఠిరుఁడింకఁ జేయునది లేక యుద్ధమున కంగీకరించెను. సంధి కుదిరిన యెడలఁ దమ బాహుపరాక్రమము చూపుట కవకాశముగాని ప్రతిజ్ఞలు నెఱవేర్చుకొనుటకు వీలుగాని కుదుర ...కుని తహతహపడు భీమార్జునులకు సంతోషము గలిగెను.

యుధిష్ఠిరుని పక్షమున నుండి సంగ్రామంబొనర్చుటకు విరాటపాంచాలాదులసైన్యములు మొత్తమేడక్షౌహిణులు చేరెను. శ్రీకృష్ణుఁడు వానికన్నిటికిఁ గ్రమముగా ద్రుపదుఁడు, విరాటరాజు, సాత్యకి, జరాసంధునికుమారుఁడగు సహదేవుఁడు, యాదవవీరుఁడగు చేకితానుఁడు, శిశుపాలునికుమారుఁడగు ధృష్టకేతువు, శిఖండి యనువారలొక్కొక యక్షౌహిణికధిపతులుగాను ధృష్టద్యుమ్నుఁడు సర్వసేనాధిపతిగాను నుండునట్లు నిర్ణయించెను. యుధిష్ఠిరుఁడు వారియందఱకు పట్టపదవులనొసంగి గౌరవించి మధురవాక్యంబుల వారుత్సాహపూరితులగు నట్లొనర్చి కురుక్షేత్రమునకుఁ బోవుదమని వారల కాజ్ఞయిచ్చి యర్జునునకు వారినెల్లఁ జూపి,

ఉ॥ "ఎవ్వఁడు నెయ్యెడం బొడవియుండఱకుం దగ నీవుకంటికిన్
జెప్పయుఁ బోలెమాటయి నెఱింబనులారసి యొజ్జచాడ్పునన్



జెప్పుచుమీకిబుద్ధిఁగొని చేయుచుఁ గార్యమునకు రక్షనాన్
నిప్పరమేశ్వరుండు గలఁ డిచ్చు శుభంబని చూపె కృష్ణునిన్.

మఱునాఁడందఱును యుద్ధోచితవేషముల ధరించి ద్రౌపదిమున్నగు పురంధ్రీమణులలాజాక్షతలు విప్రోత్తముల యాశీర్వాదములునుం గ్రహించి ధృష్టద్యుమ్నుండు ముందున నుపవలయునన్ని యుపకరణములను గైకొని సేవకజనము వెంటరా ఋష్యాశ్రమంబులకును దేవాలయంబులకును నలజడి కలుగకుండఁ జని కురుక్షేత్రమున హిరణ్వతియనునది చెంతఁ దృణకాష్ఠజలసమృద్ధంబగు తావునవిడసిరి. అచట నొకరమ్యప్రదేశంబున రాజమందిరమును నుచితములగుచోట్ల మిగిలిన యందఱనివాసంబులు నేర్పఱుప నది యొకమహారమ్యంబగు నగరంబువలె నుండెను. ధృష్టద్యుమ్నుండన్ని యెడలఁ దగిన వారలఁ గావలియుంచి శిబిరము సురక్షితము గావించెను.

దుర్యోధనుఁడు చారులవలన నెప్పటికప్పుడు సమాచారములన్నియుఁ దెలిసికొనుచుఁ గర్ణశకునిదుశ్శాసనులవలన దండయాత్రకు వలయుసన్నాహంబులన్నియుఁ గావించి ద్రోణకర్ణబాహ్లికాశ్వత్థామకృపశల్యశకునికృతవర్మభూరిశ్రవులను గాంభోజజయద్రథులను దనపక్షమునఁ జేరిన పదునొకొండక్షౌహిణీసైన్యములకు వేర్వేఱనధినాయకులనుగా నొనర్చి భీష్ముని సర్వసేనాపతిని జేసి గౌరవించెను. ఆసమయమున నాలునెత్తురు నెముకలు వర్షముగాఁ బడి భావిదురవస్థను

సూచించెను. జనులుత్సాహవిముఖులు కాఁగా దుర్యోధనుఁడు వారిని బ్రోత్సహించి వివిధదానాదులయిన శాంతిక్రియలుజరిపి సకలసేనాసమన్వితముగాఁ గదలి కురుక్షేత్రమునకుఁ జని హస్తినాపురమునందువలె నచటను దమతమపటగృహములు నిర్మింపించి యుద్ధసన్నద్ధములుగ నొనర్చెను. ఇరుపక్షములవారును దనకు సమానులగుటచేతను విశేషించి భీమసుయోధనులు తనకభిమానశిష్యులగుటవలనను నెవ్వరిహానియును జూడలేక బలరాముఁడు తీర్థయాత్రకుఁ బోయెను

(1) యుధిష్ఠిరుఁడు పాదచారియై గురుభీష్మాది శిబిరములకేగి నమస్కరించి జయముగొనుప ట్లాశీర్వాదములువడసియనుజ్ఞ గొనివచ్చెను.

ఉభయసైన్యములకును యుద్ధమారంభమయ్యెను. (1) భీష్ముఁడు తనపక్షమువారు విశేషించి నశింపకుండ రక్షించుకొనుచు నెదిరి వీరులఁబలువురఁ నుక్కడగించుచు నుదయించిన మార్తాండునివలెఁ దేఱిచూడలేనట్లు రణమొనరించుచుండెను. ఒక్కొకమాఱు పాండవసైనికులు నిరాశనొందియు నర్జునుని ప్రోత్సాహమువలన మరల నుత్సాహసమన్వితులై యెట్లోపోరుచుండిరి. ఎట్లయినను భీష్ముఁడుబ్రదికి రణమొనరించుచున్నంతవఱకుఁ బాండవులకు జయము సమకూఱుట సున్నయని యందఱకుఁ దోఁచుచుండెను. ఒక్కొకపుడర్జునుఁడును నాతని శరఘాటికిఁ దాళఁజాలక నిశ్చేష్టుఁడై నిలుచుచువచ్చెను. అ



దును దొమ్మిదవదినమున భీష్ముఁడు చూపిన శరనైపుణ్యమునకుఁ బాండవులసేనలు చెల్లాచెదరై పఱుగెత్తెను. నాటిదినమునకు యుద్ధమాపివేయఁబడెను,

నాఁటియుద్ధస్థితి కన్నులారఁగాంచినయుధిష్ఠిరుఁడు విచారపూరితహృదయుఁడై రాత్రివేళ రహస్యముగా శ్రీకృష్ణభగవానుని పటకుటీరమునకేగి ప్రస్తుతపరిస్థితులనుజెప్పి తమకు జయములభించు నాశలేదనియు మరలఁ దమ్ములఁదోడ్కొని వనములకేగి తపస్సుచేసికొనుటయే తనకుయుక్తముగాఁదోచుచున్నదనియు నధైర్యము తోఁపఁబలికెను. శ్రీకృష్ణుఁడు మంచిమాటలతో నాతనివిచారము పోఁగొట్టి ధైర్యముగఱపి పలుమాఱు కౌరవసేనల నిమేషమాత్రమున వధించెదనని యర్జునుఁడు పలికినబీరములును భీముని ప్రతిజ్ఞలును వ్యర్థములుగా, నెదిరివారు పరిహాసింప నిట్లుసేయుట తగవుకాదనియు నొకవేళ సమయము తప్పివచ్చినయెడల నొక్కనిమిషమున నేనే సకలసైన్యములను జంపి చెండాడి జయంబుగూర్తునని యుఁ బలికి మనము దేవవ్రతుని పాలికిబోయియడిగిన నాతఁడే తనవధోపాయమును జెప్పును. కనుక నట్లుపోవుట మంచిదని యాతని నొప్పించెను. పిదప యుధిష్ఠిరుఁడు సోదరులును శ్రీకృష్ణుఁడును వెంటరా భీష్మునిశిబిరమునకేగి యాతనికినమస్కరింప నతండాశీర్వదించి వచ్చినపని చెప్పుమనెను, ధర్మనందనుండపుడు దీనవదనుండై మాకుయుద్ధమునందు జయముకలుగు

నుపాయము తెలియఁగోరి వచ్చితిమని విన్నవించెను. "నేను యుద్ధము చేయుచున్నంతవఱకు మీకు జయము లభింపదు. మీ యందలి ప్రేమను బురస్కరించుకొని నావధోపాయము నెఱింగించుచున్నాను. వినుఁడు. ఆయుధము విడిచినవానిని, జెండా దించివేసినవానిని, స్త్రీని, పూర్వజన్మమున స్త్రీయైనవానిని, స్త్రీనామధారిని, పాగా వీడినవానిని, భ్రాతృవిహీనుని, సంతతిహీనుని నెదిరించి యుద్ధము చేయను. పుట్టినపుడు స్త్రీయైయుండి నడుమఁ బురుషుఁడుగా మాఱినవానితో సంగ్రామంబొనర్పను. ద్రుపదుని సంతానమగు శిఖండి యట్టివాఁడు. అతని ముందుంచుకొని యర్జునుండు నాతోఁ బోరిన నేను బరాఙ్ముఖుఁడ నగుటచే నాతఁడు నన్ను సులభముగాఁ బడవేయవచ్చును. పిదప మిగిలినవారి ననాయాసముగా జయింపవచ్చును. నా యాజ్ఞప్రకారము మీరు పోయి రేపట్లు యత్నించి నన్నుఁ బడవేసి జయము గొనుఁ"డని సాదరముగా వచించి వారి నందఱు నంపెను.

పదవనాఁ డర్జునుఁడు శిఖండిని ముందుంచుకొని భీష్ముని నెదిరించెను. భీష్ముఁడు తన వ్రతము ప్రకారము శిఖండిపై బాణములను బ్రయోగింపక పరాఙ్ముఖుఁడయ్యెను. అర్జునుఁడు శిఖండి వెనుకనుండి భీష్ముని శరీరమునఁ గొంచెమైన నెడము లేకుండ బాణముల నాటించి నాటి సాయంకాలమున కాతఁడు యుద్ధభూమిపై నొఱఁగునట్లు చేసెను. శరీరమునిండ గ్రుచ్చుకొనిన బాణములే యాతనికి శయ్యవలె నేర్పడెను. తమ్మునంతఃకరణ



పూర్వకముగాఁ బ్రేమించు ననుంగుతాత పడినందులకు సజ్జనుండు మిగుల ఖేదపడెను. భీష్ముఁడాతనిఁ దనదగ్గఱకుఁ బిలిచి నాయనా! నీవు క్షత్రియధర్మము నెఱవేర్చితివి. నన్నుఁ గూర్చి విచారింపకుము. నాకొక తలగడయుఁ ద్రావుటకు స్వచ్ఛమగు నుదకమును నిమ్మని యడిగెను. అర్జునుఁ డెంటనే మూఁడు బాణములు నేలనునాఁటి వాని మొదళ్ళు శరతల్పముతో సమానముగాఁ దలక్రిందను వచ్చునట్లు చేసి తలనందుంచి యొక్క తీవ్రబాణముతో భూమిని భేదించి పాతాళగంగను బైకి రప్పించి యాతని నోట నాధారపడునట్లు చేసెను. పిదప నమ్మహానీయుని యనుజ్ఞ నొంది యందఱును తమతమ శిబిరముల కేగిరి.

భీష్ముని తరువాతఁ గౌరవసైన్యమునకు ద్రోణాచార్యుఁడు సైన్యాధిపత్యము నొందెను. ద్రోణుఁడు తనకు సైన్యాధిపత్యమిచ్చినందులకు బ్రతిఫలముగా నొక్కవరమును గోరుకొమ్మనఁ దుర్యోధనుఁ డతనిని యుధిష్ఠిరునిఁ బ్రాణసహితముగాఁ బట్టుకొని తనకొప్పగింపుమని కోరెను. గురుఁ డాతని యభిప్రాయము నెఱుఁగఁగోరి యాతని నేమిచేయుదువని యడుగ "నాతని మరల జూదమునకుఁ బురికొల్పి యాడించి యోడించి యావజ్జీవము వనవాస మొనర్చునట్లు చేసెద"నని దుర్యోధనుఁడు పలికెను. అట్లు చేయుట తనకిష్టము లేక మిషగాఁ దప్పించుకొనఁగోరి ద్రోణుఁ డర్జునుఁడు లేనియెడల నాతనిఁ బట్టియిచ్చెద ననెను. దానిని విని తానున్నంతవఱకు నాతనిఁ బట్టనీయనని యర్జునుఁడు ప్రతిన యొనర్చెను.

మఱునాఁడు యుద్ధమారంభమయ్యెను. అర్జునుఁడు తనతో యుద్ధమునకుఁబిల్చిన సంశప్తకులను వధించుటకు దూరముగాఁబోయెను. ద్రోణుఁడు శత్రువులకసాధ్యమగు పద్మవ్యూహమును బన్నెను. అర్జునుఁడచట లేకుండుటవలన నావ్యూహము నితరులు భేదింపలేకుండుటవలనను యుధిష్ఠిరుఁడభిమన్యునిఁబిలిచి దానిని భేదించుకొని ముందునీ వేగవలెనని వెనువెంటనే మేమును నీకుసహాయముగావత్తుమని ప్రోత్సహించెను. మహాశూరుండగు నాతఁడు వెంటనే బయలుదేఱి యెదురులేని పరాక్రమంబున వ్యూహము భేదించుకొని లోనికేఁజొరఁబడెను. సైంధవుండగు జయద్రథుఁడు వ్యూహద్వారమునకు వచ్చినిలిచెను. అతఁడు మున్నొకమాఱు అర్జునుఁడు తప్ప మిగిలిన పాండవులనందఱ నొక్కనాఁడు జయించునట్లీశ్వరునిచే వరమ్ముఁగొనియున్నవాఁడగుటచే వానినెవ్వరు నచటినుండి యొక్కయడుగైనఁ గదల్పలేరైరి.

అభిమన్యుండొంటరివాఁడై దుర్యోధనుఁడు మున్నగు మహారథికులందఱు నొక్కుమ్మడి తనపైఁగవిసి పరాక్రమము చూపుచున్నను జలింపక దుశ్శాసనునోడించి తఱిమి వృషసేనుమూర్ఛపుచ్చి దుర్యోధనపుత్రుఁడగు లక్ష్మణునిఁ బరిమార్చి కర్ణాదిమహాయోధులందఱును వంచనచేఁ దన్నువిరథునిచేయ దుశ్శాసనునికుమారునిఁజంపి తానును మరణించెను. బాలుండగు నాతనినమ్మించి పంపి పిదప తాను సహాయము చేయలేకపోయినందులకు యుధిష్ఠిరుఁడు చెప్పనలవికాని



విచారమునుబొందెను. వేదవ్యాసుండును నారదమహర్షియు వచ్చి మృత్యుదేవతాప్రభావంబును సువర్ణష్ఠీవిచరిత్రమును చెప్పి యాతని దుఃఖోపశాంతి చేసిరి. విజయుఁడానాఁటిరాత్రి ప్రతిజ్ఞయొనర్చి మఱునాఁడు సాయంకాలమునకు సైంధవుని వధించెను.

యుధిష్ఠిరుఁడు ద్రోణాచార్యులతో మొదటిదినమునను నాల్గవదినమునను యుద్ధము చేసి యాతనిధాటికోర్వఁజాలక తిరిగిపోయెను. గురునిచే నెందఱో రాజులు సంహరింపబడుచుండిరి. ఆతనిబారినుండి తప్పించుకొనుటయే కష్టముగానుండెను. పదునైదవనాఁటియుద్ధము కడు ఘోరముగనుండెను. శ్రీకృష్ణుఁడర్జుననిఁజూచి కుమారుఁడు చనిపోయెనన్న వార్త విన్నచో నితఁడాయుధంబువిడిచి యుద్ధముమానును. కనుక "అశ్వత్థామ చచ్చెను" అనుమనెను. అర్జునుఁ డసత్యమాడనని నిరాకరించెను. ఆసమయముననే భీమసేనుఁడు అశ్వత్థామయను పేరుగల మాళవరాజు నేనుఁగును సంహరించెను అనునెపమున భీమసేనుఁడు గురునిదగ్గఱకేగి యశ్వత్థామచనిపోయెనని గట్టిగా నఱచెను. ద్రోణుండదివిని హృదయంబు చంచలింప భీముని మాటప్రమాణము కాదని మరలఁగుదురుపఱచుకొని యుద్ధము చేయుచుండ విశ్వామిత్రాది ఋషులువచ్చి బ్రాహ్మణధర్మము కాని సంగ్రామము విడచి శాంతినొందుమని పలికిరి. తనపుత్రుని మరణము సత్యమా యసత్యమాయని యుధిష్ఠిరునే ద్రోణుఁడు ప్రశ్నింపఁగ నతనికిష్టము లేకున్నను భీమునియొక్కయు శ్రీకృష్ణునియొక్కయు గట్టిప్రేరణవలన నాతఁడు.

గీ. "వలయు కొలఁది యెలుంగెత్తి◆వర్ణనమితి
యుచ్చరింపఁగ 'నశ్వత్థామ◆హత' యనుచు
ననిపదంబడి మెల్లన◆నతని చెవికి
వినఁగరాకుండఁ◆గుంజరమనియు..."

ద్రోణుఁడామాటలువిని శస్త్రములువదలి యోగము పట్టి తేజోమయాత్ముండై ప్రాణములు విడుచుచుండ ధృష్టద్యుమ్నుఁడు రథముపైకుఱికి యాతనికేశములఁబట్టుకొని ఖడ్గమునఁ గంఠము తెగవేసెను. ద్రోణునియాత్మదివ్యతేజోరూపంబునఁ బరమాత్మలో నైక్యమందెను.

ఆతని యనంతరమునఁ గర్ణుఁడు సైన్యనాయకుఁడయ్యెను. కర్ణుని యుద్ధమునందు మొదటిదినమున యుధిష్ఠిరుఁడు దుర్యోధనునితో ద్వంద్వయుద్ధమొనర్చియాతని విరథుని జేయఁ గర్ణాదులాతనికి సహాయమైవచ్చి యాతఁడుమఱియొక రథమునెక్కువఱకు రక్షించిరి. పిదప నాతఁడు మరలఁడీకొన యుధిష్ఠిరుఁడాతని మూర్ఛిల్లఁజేసెను. సారథి యాతనిని దూరముగాఁ గొనిపోయెను.

కర్ణుని రెండవనాటి యుద్ధమారంభమయ్యెను. నాఁడాతనిఁ జంపెదనని యర్జునుఁడు బయలుదేఱెను. కాని సంశప్తకాదులగు మహావీరులడ్డుపడి యాతనికర్ణునిపైపున కేగనీయరైరి. కర్ణుఁడధికతేజంబున నాఁటియుద్ధమునఁ దేఱిచూడరాక పరాక్రమముఁ జూపుచు ధర్మనందనునిపైఁగవిసి యాతనికి సాత్యకియు



శిఖండియు సహాయులుగావచ్చినను లక్ష్యపెట్టక యందఱధనుస్సులను ఖండించి విరథులనుజేసి విశేషించి ధర్మజునిశరీరమునిండ నెడములేకుండ బాణములునించి నొప్పించిన నతఁడు సహింపఁజాలక పాఱిపోవుచుండెను. కర్ణుఁడతని వెనువెంటఁబడి తఱుముచు "యుధిష్ఠిరా! క్షత్రియకులమున జన్మమొంది ధర్మాధర్మవిదుండవైన నీవిట్లుప్రాణములకాసపడి వెన్నిచ్చి పఱువెత్తుటతగునా? నీబుద్ధి తెలియవచ్చెను. రాజనీతి నీకుదెలియదు. బ్రాహ్మణాచారములు మాత్రము నీకుఁదెలియును. కావున యాగాదికర్మలనాచరించుటకు నీవు పనికివత్తువుగాని యుద్ధమునకుఁ బనికిరావు. ఇఁకనైన నొంటరిగానుండక వేగముగ నింటికినడువుము. లేదా కృష్ణార్జునులున్నచోటికైన నేగి వారి చాటుననుండుము!" అని బహువిధముల నిష్ఠురములాడి నొప్పించి కుంతికిఁదానిచ్చిన వరమువలనఁ జంపకవిడిచెను. యుధిష్ఠిరుఁడు తిన్నగాతనశిబిరమునకువచ్చెను.

ఆతనిహృదయము పరాభవాగ్నిచే దహించివేయఁబడుచుండెను. ఇంతలోఁ గృష్ణార్జునులీసమాచారమువిని రెండుజాములగుటచే నప్పటికియుద్ధముచాలించి కుశలమునెఱుఁగుటకై ధర్మనందనుని శిబిరమునకేఁగుదెంచిరి.

యుధిష్ఠిరుఁడు తనశిబిరమునందు శయ్యపైఁబరుండియుండెను. కృష్ణార్జునులుపోయి యాతనికినమస్కరింప నాతఁడాశీర్వదించి కర్ణునివధించియే వారువచ్చిరనితలంచి తదనుకూ

లముగ మాటాడెను. కర్ణునింకనుజంపలేదు. ఇప్పుడే పోయి వానిని సంహరించివచ్చెదనని యర్జునుఁడనెను. అందుపై యుధిష్ఠిరుఁడు కోపము తెచ్చుకొని "అట్లయిన నేనొక్కఁడనే కాదు. నీవును నాతని కోడియేవచ్చితివి. ఇంతపరాక్రమహీనులమైన మనము యుద్ధముసేయుట యెక్కడ? నడువుము. మరలనడవులకుఁబోయి యచటనేయుండి తపముచేసికొందము. లేనిచోఁబౌరుషమువీడి సుయోధనుకడకుఁ వినయముగాఁబోయి యతఁడిచ్చినదయాధర్మపుబిచ్చ మెంతయైననుబుచ్చుకొని యుదరపోషణము చేసికొందము. 'కర్ణునిసంహరింతు,' నని బిరుదుమాటలు నీవు వలుకుటవిని నిజమేమోయనుకొని మోసపోయి యుద్ధమునకుఁబూనుకొంటినిగాని యథార్థస్థితి తెలిసినయెడల నింతయుత్సాహము నలుపుదునా? వెఱ్ఱినై యుద్ధమునకు దిగి మహానీయులగు ద్రుపదవిరాటాదులఁగోల్పోయితిని!" అనికృష్ణునివంకజూఁచికర్ణునెదుట నిలుచుట బహుకష్టమయ్యెను. దుర్యోధనాదులుచూచుచుండ వానిచేఁబరాభవింపఁబడియు బ్రతికియుండుటకు మిగులసిగ్గగుచున్నది. అట్టిస్థితిలో భీముఁడువచ్చి యడ్డుపడ నేనుదొలఁగివచ్చితిని. పాపము! ఆతఁడింకను బ్రాణముల కాసింపక శత్రుసైన్యములతోఁ బోరాడుచునేయున్నాఁడు. అని మరలఁబార్థునివైపుచూచి అభిమన్యుఁడైనను ఘటోత్కచుఁడైన బ్రదికియుండిన నాకట్టిగతిరానిత్తురా? కృష్ణుఁడుండఁ బాఱివచ్చునంతటి యవసరము నీకేలకలిగినది? నీకుఁ జేతగానియెడల గాండీవ



మాహాత్మ్యునిచేతికిచ్చి నీవుసారథివైయాతని రథికునిఁజేసినయెడలఁ గర్ణుని వానిసహాయములనుగూడ నాతఁడే నిముసములోఁబరిమార్చియుండునుగదా? కుంతీగర్భమున నీవుజన్మింపకయేయుండిన యెడల నింతయాపద గలుగకుండును," అని మిగుల నిష్ఠురముగ మాటలాడెను.

తనగాండీవము నితరుల కిమ్మని యెవ్వరందురో వారి శిరము దగులవేసెదనని యర్జునుఁడు ప్రతిజ్ఞవహించియుండెను. కోపవశమున యుధిష్ఠిరుఁడే యట్లుపలికెను. అర్జునుఁడంతుల కుఁగోపించియొరనుండిఖడ్గముదులాగి యన్నను సంహరింపఁబోవ కృష్ణుఁడడ్డుపడి సంగతి తెలిసికొని కోపపడియసత్యమాడియైన నహింసాధర్మము రక్షింపవలెనని ధర్మసూక్ష్మము నెఱిఁగించి "పూజ్యులగు వారిని దూషించుట చంపుటవంటి" దని తెలిపి ప్రతిజ్ఞ నిర్వహించుకొనుటకై ధర్మనందనుని నిందింపుమనెను. హింసలేకుండఁబ్రతిజ్ఞ నిర్వహింపఁబడుటకుఁ బార్థుఁడు సంతసించి యన్ననుద్దేశించి "భుజాబలశాలివై శత్రులనిర్మూలించుశక్తిగలభీమసేనుండు నన్ను నిందించుట యందముగాని యుద్ధము చేయలేక పాఱివచ్చిన నీవునిందించుట తగువా? ఇప్పుడేకాదు. ఒక్కనాఁడైన నిలిచియుద్ధముచేసితినని ప్రేలుమడిచి చెప్పుము. చూతము. ఇట్టినీవా నన్నుఁ బౌరుషహీనుఁడనని నిందించుట? నింద్యప్రవర్తనగలిగి నీవుజూదమాడుటవలననే మేమందఱమును నీతోఁబాటు దుర్యోధనునికి విరోధులమై రాజ్యమునుగోల్పోయి యరణ్యాజ్ఞాతవాస దుఃఖముల ననుభవింపవలసివచ్చె

ను. ఇంతయైనను సిగ్గులేక చేతఁగానివాఁడవు మాటలాడకుండ నొకచోనుండక మీఁదుమిక్కిలి పరాక్రమముచూపు నన్ను నిందించుటకుఁగూడ నారంభించితివి. జరిగినదేమో జరిగినది. ఇఁకనైన జాగ్రత్తగానుండు"మని నిందావాక్యములనాడెను.

అర్జునునకు యుధిష్ఠిరునియెడల నత్యధికభక్తివిశ్వాసములుగలవు. ప్రతిజ్ఞానిరోధమున నాతఁడట్లు తూలనాడెనే కాని మనఃపూర్వకముగఁ గాదు. అన్ననట్లు దూషించినందున నాతఁడు పిదప మిగుల సంతాపమునొంది కత్తిదూసి యాత్మహత్యచేసికొనఁ బ్రయత్నింప హరి యడ్డుతగిలి నివారించి పూజ్యుఁడగు సహోదరుని నిందించినందులకుఁ బ్రాయశ్చిత్తంబుగాఁ దలనఱికి కొందునను నాతని పూనిక తెలిసికొని "ఆత్మప్రశంసచేసికొనుట మరణముతో సమానమని పెద్దలు చెప్పుదు"రను ధర్మము నెఱింగించి నీపరాక్రమంబులను బొగడుకొనుమని బోధించెను. అర్జునుఁడు సంతోషించి యాత్మస్తుతియొనర్చుకొని పిదప నన్నచరణములపై వ్రాలి తనయపరాధములను మన్నింపుమని ప్రార్థించి నాఁటిసాయంకాలములోఁగాఁ గర్ణునివధింతునని ప్రతిజ్ఞయొనర్చి రణమునకుఁబోవననుజ్ఞ వేఁడెను. అర్జునుఁడు తన్నునిందించినందులకు ధర్మనందనుండు చిన్నపుచ్చుకొనఁగాఁ గారణముల నెఱింగి కృష్ణుఁడాతని మనఃకలంకమును దొలఁగించెను. కృష్ణార్జునులు ధర్మజునిచే ననుజ్ఞాతులై రణరంగమునకరిగిరి. అర్జునుఁడు నిరుపమానప్రతాపము



చూపి కర్ణుని సంహరించెను. భీముఁడు దుశ్శాసనునిఁజంపి ప్రతిజ్ఞాప్రకారమాతని గుండెలు బ్రద్దలుచేసి వేడినెత్తురు దుర్యోధనుఁడు చూచుచుండఁ ద్రావితలఁ ఆకెను.

కర్ణునవంతరమున శల్యుఁడు సేనాధిపతి యయ్యెను. ఆ నాఁడు శల్యభీమసేనులు గదాయుద్ధ మొనర్చునంత శల్యుఁడు మూర్ఛితుఁడై పడిపోవఁ గృపాచార్యుఁడాతని దూరముగాఁ దొలఁగించుకొని పోయెను. అతఁడు మూర్ఛ తేఱి యుధిష్ఠిరుని తోఁ దలపడి ద్వంద్వయుద్ధమున కారంభించెను. యుధిష్ఠిరుఁడాతని విరథునిఁ గావించి యాతఁడశ్వత్థామ సహాయమున మఱియొక రథముపై నధిరోహింప మరల నెదుర్కొని యమోఘమగు శక్తిని బ్రయోగించి సంహరించెను. ప్రధానయోధవరులందఱును జనిపోవుటవలనఁ గౌరవసేన చెల్లాచెదరై పాఱిపోయెను. యుయుత్సుఁడను నొక్కఁడు మాత్రము దక్కఁ దక్కిన దుర్యోధనుని తమ్ములందఱును వీరస్వర్గమునొందిరి. దుర్యోధనుఁడు రణరంగమును వదలి పఱువెత్తి జలస్తంభనవిద్యామహిమచే ద్వైపాయన మను మడుగున దాఁగుకొనెను.

యుధిష్ఠిరుఁ డాసంగతి తన యాహారసంపాదనకై వేటకు వెడలిన కొంతమంది సేవకుల వలన నెఱిఁగి సోదరులతోఁ గూడ నాహ్రదము గట్టునకేగి నిలిచి దుర్యోధనునిఁ బిలిచి "వల నీయొక్కని ప్రాణమును రక్షించుకొనఁ గోరెదవు? బయటికి వచ్చి పౌరుషముతోఁ బోరాడుము. చచ్చి వీరస్వర్గమో జయము

చి సామ్రాజ్యమో పొందుము. రమ్ము యుద్ధమొనర్పుము" అని పిలిచెను. "నా తమ్ములు మిత్రులు మున్నగువారందఱును గతించిరి. నాకీరాజ్యమేలకే? మీరందఱును సుఖముగానున్నారు. కనుక రాజ్యమును మీకిచ్చెదను. మీ రేయేలుకొనుఁడు" అని లోపల నుండియే యతఁడు బదులు పలికెను. యుధిష్ఠిరుం డపుడు "దుర్యోధనా! ఉత్తమ క్షత్రియ వంశమున జన్మించిన నేను నీవలన దానము పట్టెదనా? అట్లు వీలుపడదు. బయటికి వచ్చి మాలో నీయిచ్చ వచ్చిన యొకనితో ద్వంద్వయుద్ధము చేయుము. వానిని నీవు గెలిచినయెడల రాజ్యమంతయు నీవే గ్రహింపుము. మాలోవాఁడు గెలిచిన మాకిమ్ము" అని మిగుల ధర్మయుక్తముగఁ బలికెను.

యుధిష్ఠిరుని ధర్మవాక్యములకు దుర్యోధనుఁడు మిగుల సంతోషించి గదాధారియై బయటికి వచ్చి భీమునితో గదా యుద్ధము చేయుదుననెను. అందఱు నుశ్యమంతపంచకమను చోటికిఁ జనిరి. భీమ దుర్యోధనులచట ఘోరముగఁ బోరిరి. తుదకు భీముఁడాతనితొడలు గదతో విఱుగఁగొట్టనాతఁడు భూమిపైఁ బడిపోయెను. ధర్మనందనాదులు విజయోత్సాహపూరితులై తమ శిబిరముల కేగిరి.

పడియున్న దుర్యోధనుని కడకుఁ గృపాశ్వత్థామలు వచ్చి చాలశోకించిరి. దుర్యోధనుని కోరికపై నశ్వత్థామ శివునిఁ గూర్చి నిశ్చలతపంబొనర్చి ప్రత్యక్షమయిన యాతనిచే ఖడ్గ



మును సంపాదించి తిన్నగాఁ బాండవ శిబిరమునకుఁ బోయి యచట నిద్రించు ద్రౌపదీ పుత్రులను శిఖండి ధృష్టద్యుమ్నులను నింక ననేకులను సంహరించి యీసువార్త దుర్యోధనున కెఱింగించెను. అతఁడది విని సంతోషముతోఁ బ్రాణములు వదలెను.

తన పుత్రులందఱు నశ్వత్థామచే హతులైరను వార్త యుధిష్ఠిరుఁడు విని మిగుల విచారించెను. ద్రౌపది దుఃఖతయై యతనిం జంపుమని కోరియుఁ దద కాతని శిరోరత్నమును బుచ్చుకొని తనపూనిక వదలెను.

యుద్ధము సమాప్తమయ్యెను. దుర్యోధనాదుల మరణమునకు గాంధారీ ధృతరాష్ట్రులు మిగులవిచారించిరి. వారు యుద్ధభూమికిఁ బోయిన శ్రీకృష్ణుఁడును బాండవులు వాతనిం జూడఁ బోయిరి. ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరునిఁ గౌఁగిలించుకొని రోదన మొనర్చి మనభీముఁ డేడని యడిగెను. శ్రీకృష్ణుఁ కల్పితముగ నినుపభీమువిగ్రహము నతని కడకుఁ దేఁగా దానినాతఁడు కౌఁగిలించుకొని ముక్కముక్కలు చేసెను. అతనిదుర్బుద్ధికి శ్రీకృష్ణుఁడాతని నిందించెను. ధృతరాష్ట్రుఁడాతనిందన తప్పు క్షమింపుమని వేడుకొనెను.

యుధిష్ఠిరాదులు గాంధారికడకేగి నమస్కరింప నామె దీవింపక ధర్మజుని శపింప సిద్ధపడఁగా వెంటనే వ్యాస మహర్షి ప్రత్యక్షమై యతని తప్పించుకయు లేదని నచ్చఁజెప్పె

యాప్రయత్నము మానెను. ఆమె వేఱ్వేఱుగాఁ దన కొడుకుల శవములను జూచి శోకించి యంతయును శ్రీకృష్ణుని వలన జరిగినది గనుక నాతని నుద్దేశించి “కృష్ణా! నీవు సమర్థుండవైనను సంధిచేయక యందఱును జచ్చునట్లు చేసితివిగాన నీవంశము వారందఱు నిట్లే చత్తురుగాక. నీవు మహాటవియందు దిక్కుమాలిన చావు చత్తువుగాక” యని శపించెను,

యుధిష్ఠిరుఁడు ధౌమ్యాదులచే దుర్యోధనాదుల కగ్నికార్యము యథావిధిగ నెఱవేర్పించెను. ధృతరాష్ట్రుని, స్త్రీజనమును దోడ్కొని గంగకుఁ జని స్నానమొనర్పించి వారలచే మృతుల కుదకదానాదులను జేయించెను. ఆసమయమునఁ గుంతి వచ్చి కర్ణుఁడు తన పుత్రుఁడే గనుక నాతనికిఁ గూడఁ దిలోదకము లొసంగుమని పాండవాగ్రజునితోఁ జెప్పెను. అట్టిమహాపరాక్రమశాలి యగు కర్ణుఁడు తమ కగ్రజుఁడని విని పాండవు లందఱును చేఁజేత నాతని వధించుకొని నందులకు మహావిచారము నొందిరి. యుధిష్ఠిరుఁడును మిగుల జాలినొంది కర్ణుని భార్యాసుతులను రావించి యాతనికిఁ గర్మకలాపము సంతుష్టిగా నొనర్పించెను. తల్లి యాతని వృత్తాంతము దాచినందులకు యుధిష్ఠిరుఁడు మిగులవిచారించి “స్త్రీలకిఁక రహస్యమును రక్షించుకొను శక్తి లేకుండుఁగాక” యని శాపం బొసంగెను. అందఱును మరల హస్తినాపురమును జేరిరి.

---

## పదునైదవ ప్రకరణము.

### పట్టాభిషేకము.

శ్రీకృష్ణ పరమాత్మ యుధిష్ఠిరాదులతో శాంతనవు సన్నిధికేగి సమస్త శత్రువిజయము నెఱింగించి యుధిష్ఠిరుని రాజ్యాభిషేకమున కాతని యనుమతిని గోరెను. భీష్ముఁడు మిగుల సంతోషించి యాశీర్వదించి ధర్మయుక్తముగఁ జాలకాలము భూమండలమును బాలింపుమని యాజ్ఞయిచ్చెను. పిదప వామదేవుఁడు ధౌమ్యాది పురోహితవర్గము నారదాదిఋషివర్గము వైదికక్రియలు నడుప శుభముహూర్తమున ధృతరాష్ట్రవిదుర కృపాచార్యాదుల సమక్షమున యుధిష్ఠిరునిఁ బట్టాభిషిక్తునిగ నొనర్చెను. అతఁడు సుతులు గతించిరను లోపము లేకుండ గాంధారీ ధృతరాష్ట్రుల మిగుల మన్ననతోఁ జూచుచుండెను.

భీష్ముఁడింకను నంపసెజ్జపైననే పరుండియుండెను కృష్ణుఁడొకనాఁడు యుధిష్ఠిర సార్వభౌమునిఁ గాంచి భీష్ముఁడు నిరుపమానజ్ఞాని. అతనికిఁ దెలిసిన ధర్మము లెవ్వరికిని దెలియవు. అతఁడంతరించిన నీధర్మములన్నియు నంతరించును. ఆతని నాశ్రయించి యాధర్మములను దెలిసికొనుమని యాతని భీష్ముని కడకుఁ దోడ్కొని చని మహాత్మా! యీతనికి ధర్మబోధ మొనర్చుమని కోరెను. భీష్ముఁడంగీకరించి యేఁబదియాఱు దినము లాతనికి సమస్త ధర్మములును బోధించెను. ఇంతలో నుత్తరా

